LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.nellore.com

# జమీన్‌రైతు



నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 1 | 7.1.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి: రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# ...ంగలపైరాస్తే దొరలకెందుకు ఉలుకు?

అధికార యంత్రాంగంలో ...ల్ల కంపు ముక్కులు పగల ...న గత వారం జమీన్‌రైతులో - రెవిన్యూ ఉద్యోగులకు రోషం వచ్చింది. రెవిన్యూ సర్వీసెస్

**...్యమాతలకు ...ల ప్రదానం ...జం కాదా?**

...న్ కలెక్టరేట్ యూనిట్ అధ్యక్ష... పేరుతో మాకొక బెదిరింపు ... పాలనా పరమైన లోపాలు ... విప్పి చెప్పాలట కాని వార్తలు ... జమీన్‌రైతులో వ్రాసినవి ...ంగ్ వార్తలట. ఈ లేఖ ...లోని ఈ ప్రబుద్ధు లిద్దరికి ...లేక వారికంటే తెలివి మీరిన ...ంగవ్రుల పుర్రెలో పురుగు తెలియదు కాని - రెవిన్యూ నిరుద్యోగి దర్పణం వలె వుంది. ...ల్లూరు ఎమ్మార్వో రామిరెడ్డి గారు ...యాన్ని భ్రష్టు పట్టిస్తున్నారని; ...ం అందించే పదతులకు పట్టాల ...స్తున్నారని; అవినీతిలో రికార్డులు ...స్తున్నారని - గతవారం మేము ...దుకు కొన్ని నిర్దిష్ట సంఘటనలూ ...ం! మొత్తం రెవిన్యూ ఉద్యోగు... అవినీతిపరులని మేమెక్కడా

వ్యాఖ్యానించలేదు. తమకు సంబంధంలేని వార్తపై ఖండన పంపడం రెవిన్యూ సర్వీసెస్ సంఘం చేసిన అదన ప్రసంగం; ఒకవేళ తమ తోటి ఉద్యోగులకు మద్దతు ఇవ్వదలచుకొంటే మా వార్తలో ఏది తప్పో వివరించాలి. ఎమ్మార్వోగారు పట్టాలు అమ్ముకోలేదనో, అవినీతికి పాల్పడలేదనో వివరణ ఇవ్వాలి. కాని వీరు 'వాటి' జోలికి వెళ్లలేదు. అంటే దాని అర్థం ఆ ఎమ్మార్వో మహాశయుడు చేసిన భ్రష్టుపనులన్నీ నిజమేనని వారి సంఘం అంగీకరించిన దన్నమాట. ఆయన తప్పు చేయలేదనుకుంటే అది మేము వ్రాస్తే మాత్రం బ్లాక్‌మెయిలింగ్ వ్రాతలట. రెవిన్యూ ఉద్యోగులకు తెలివి మోకాలిలో వుంటుందా ఏమి?

ఒక ఎమ్మార్వోయే కాదు - ఆదరణ

సమాచారం లభ్యమైంది. నెల్లూరు ఎమ్మార్వోగారు తాను ఇటీవల పట్టాలు పంచిన ఫైళ్లన్నింటినీ ఆఫీసు నుంచి మాయం చేశారట. విచారణ జరిపినా ఆచూకీ లభించకుండా చేసే ప్రయత్నమన్నమాట.

**భుజాలు తడుముకున్న రెవిన్యూ అసోసియేషన్**

అతడికంటే ఘనుడు ఇవంట మల్లన్న అన్నట్లున్నాడు - డిఆర్‌డిఏ ప్రాజెక్ట్ డైరెక్టర్ ఆయన లీలలు అసంఖ్యాకంగా వినిపిస్తున్నాయి. గత ఏడాది కాలంగా డిఆర్‌డిఏలో జరిగిన నిధుల వ్యయంపై

హెల్త్ ఉద్యోగుల నియామకం నుంచి; ఇప్పుడు పెండింగ్‌లో పడిన పశువుల మందుల కొనుగోలు వరకు ప్రతి ఫైలులోనూ కాసుల గలగలలే! ఆదరణ పథకం అమలులో ఇన్‌ఛార్జిగా వ్యవహరించిన గోపాల్ అనే మరొక అధికారి ఘనకార్యాలు కథలు కథలుగా వినిపిస్తున్నాయి. అక్కడ నిధులు ఖాళీ కాగానే, పెద్ద పలుకుబడి ప్రయోగించి పిల్లల పౌష్టికాహారం పథకం - ఐసిడిఎస్ పర్యవేక్షణాధికారిగా నియమింపజేసుకున్నారట. ఇప్పుడా పథకంలో 11 కోట్లపై చిలుకు నిధులున్నాయి. బెల్లం వున్నచోటే కదా - ఈగలు వాలేది! ఆర్‌డిఓ స్థాయి అధికారులు నిర్వర్తించవలసిన బాధ్యతలు ఈ చిరుద్యోగికి ఎట్లా లభిస్తున్నాయో తెలియదు. జిల్లా హౌసింగ్ కార్యాలయంలో అవినీతి చెదలు

గలగడం ఆశ్చర్యం కల్గించే విషయం. ఆయన పలుకుబడి ఎంత గొప్పదో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. ఆయన వ్యక్తిగత ఆస్తి మొత్తం హౌసింగ్ కార్పొరేషన్ విలువ కంటే అధికమని వినికిడి!

**ఇళ్ల స్థలాల ఫైళ్లు ఎందుకు దాచేశారు!**

డిపెప్ పథకం అమలు పెద్ద గోల్మాల్ తతంగం వలె మారిందని చెప్తున్నారు డిఇఒ గారు నిజాయితీపరులట; వేలెత్తి చూపే తప్పు చేసేవారు కాదట.-కాని పథకం నిధులు మాత్రం ఆయనకు అడుపుతప్పి జారిపోతున్నట్లున్నాయి. సిఎంఆర్వై పథకానికి సంబంధించి కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి కొందరు గిరిజనుల పేరుతో ఇటీవలే 14లక్షలు డ్రా చేశారని ఒక వార్త. వాస్తవంలో ఆ పేరు గల్గిన గిరిజనులూ లేరు. ఆ పథకాలూ లేవని చెప్తున్నారు. హృద్రోగులకు సిఎం రిలీఫ్ ఫండ్ నుంచి సాయం అందించే విషయంలోనూ ఆయన మాస్టర్ డిగ్రీ సంపాదించారని తెలుస్తుంది. కోవూరు మార్కెటింగ్ కమిటీ ఛేర్మన్, సమీప బంధువులకు కూడా రిలీఫ్ అందిందంటే - పేదల నుద్దేశించిన ఈ పథకం ఏ గతి

తొరవ 7వ పేజీలో

**అక్కడ దొంగలు, ఇక్కడ దొంగలు ఎక్కడ చూసినా దొంగలే, దొంగలు. కలెక్టర్ గారూ! పట్టుకోండి అవినీతి పరుల భరతం పట్టండి.**

డిపెప్, సిఎంఆర్వై, హౌసింగ్, పౌరసరఫరాల వంటి పథకాలు పర్యవేక్షిస్తుండిన పలువురు ఇతర అధికారులూ అవినీతికి పాల్పడుతున్నారన్నది నిజం. గతవారపు మా వార్తలో తొందరపాటు, తప్పిదం వుందని మేము ఏ మాత్రం భావించడం లేదు. ఇంకా చెప్పాలంటే వాటిని ధృవపరిచే అదనపు

విచారణ జరిపితే కళ్లు తిరిగే వాస్తవాలు వెలికి వస్తాయని చెప్తున్నారు. అది చాలదన్నట్లు పలు ఇతర ప్రభుత్వ కార్యాలయాలకు, పథకాలకు ఇన్‌ఛార్జిగా వ్యవహరించే అదృష్టం కల్గిందాయనకు! దానితో పసిడి పంట పండించుకున్నారని వినికిడి. ఇటీవల జరిగిన మెడికల్ అండ్

పుట్టవలె పేరుకపోయి వుంది. ఆ అధికారి గత ఇరవయ్యేళ్లుగా నెల్లూరులోనే ఒక శాఖ నుంచి ఇంకొక శాఖకు మారుతూ డ్యూటీ చేయగల్గుతున్నారు. ఏ ప్రభుత్వం వచ్చినా ఆయన అవినీతికి అడ్డుకట్ట వేసేవారే కన్పించడం లేదు. జిల్లా స్థాయి అధికారి రెండు దశాబ్దాలపాటు ఒకే జిల్లాలో కొనసాగ

# ...మార్కుల ప్రలోభం-విద్యార్థులకు శాపం-జన్మభూమి పాపం!

...ఖ్యమంత్రి చంద్రబాబుకు ఎంతో ...మైన జన్మభూమి పథకం గందం...యింది. రెండవసారి అధికారం ...త్వాత ప్రప్రథమంగా ప్రారంభించిన ...త కార్యక్రమం సమస్తం తీన్మారై ... విద్యార్థులను ఆకర్షించడానికి ...ఆశ చూపించడం ఆయన చేసిన ...గ్రామాలలో సమాచార సేకరణకు ...రెత మైక్రోలెవెల్ సర్వే జరిపించ... ముఖ్యమంత్రి అందుకు వారికి ...రితోషికం లేదా మెరిట్ సర్టిఫికెట్ ...స్తుంటే సరిపోయేది. కాని ఏకంగా ... అదనపు మార్కులు ఇస్తానని ...రు. ఆలోచనలేని ప్రకటన అది. ... అన్ని తరగతుల విద్యార్థులు ... మంది వరకు వున్నారు. కాని ...పాల్గొనింది కేవలం 64 వేల ... జన్మభూమిలో పాల్గొన్నారని వీరికి ... అదనపు మార్కులిస్తే - కష్టపడి

పరీక్షలు వ్రాసే తతిమా లక్షలాది మంది పరిస్థితి ఏమిటి? ప్రతి పై చదువుకూ స్వల్ప మార్కుల తేడావున్నా కాలేజీలో సీట్లు దొరకని కాంపిటేటివ్ రోజులివి. ఇచ్చే మార్కులు ఏ పద్ధతిలోనన్నదీ స్పష్టం చేయలేదు. జన్మభూమిలో పాల్గొన్నందుకు 30శాతం; సర్వే సక్రమంగా జరిపినందుకు 70శాతం మార్కులు ఇస్తామన్నారు. ఆ ప్రతిభను ఎవరు, ఎట్లా నిర్ణయిస్తారు? రెవిన్యూ అధికారులు ఒకచేట ఉదారంగా మార్కులు వేసి, మరొకచేట కోత పెడితే విద్యార్థులకు న్యాయం ఎట్లా జరుగుతుంది? అసలు ఇటువంటి సర్వేలు జరపడానికి విద్యార్థులకున్న శిక్షణ ఏమిటి? అర్హత నిర్ణయం ఎట్లా? పదవ తరగతి విద్యార్థి, పోస్ట్‌గ్రాడ్యుయేట్ స్కాలర్ సర్వే జరుపుతున్నప్పుడు ఇద్దర్నీ ఒకే కొలమానంతో కొలవడం ఏమి న్యాయం?

ఏ ఉద్దేశంతో చంద్రబాబు ఈ ప్రయోగం చేయదలచారోకాని దానివల్ల విద్యార్థుల్లో తీవ్ర ఆందోళన వ్యక్తమైంది. అన్ని రాజకీయ పార్టీల విద్యార్థి సంఘాలూ ఆందోళనలు జరిపాయి. మార్కుల పద్ధతిపై విద్యార్థులు వేసే ప్రశ్నలకు సమాధానం

ల్యేలు, కలెక్టర్లు, ఇతర అధికారులు పూర్లలోకి అడుగు పెట్టలేక పోయారు.

నాలుగు నెలల క్రితం ఎన్నికలలో చంద్రబాబుకు బ్రహ్మరథం పట్టిన ప్రజలు, ఇంతలోనే ఆయన కార్యక్రమాలను ఇంతగా నిరసించడం విస్మయకరం. ఈ పరిణామం

**గ్రామసభల్లో రసాభాస - ప్రజల్లో సర్కార్‌పై నిరసన**

చెప్పడం కలెక్టర్లు, మంత్రులకు అలవి కాలేదు. దానితో రసాభాస అయ్యింది.

ఇంకొక ప్రక్క గ్రామ సభలలో జనం అధికారులను నిలదీశారు. పేందలాది గ్రామాలలో గ్రామ సభలు రచ్చపట్టాయి చాలా పూర్లలో బహిష్కరణ జరిగింది. ఎమ్మె

ఆయన్ను గత్తరపెట్టింది. అప్పటికప్పుడు కలెక్టర్లతో వీడియో కాన్ఫరెన్స్ పెట్టి పరిస్థితి చక్కదిద్దడానికి ప్రయత్నించారు. కాని అప్పటికే సమయం మించిపోయింది.

ప్రజలలో నిరసన పెల్లుబకడానికి కారణం - ఎన్నికలు కాగానే పెరసపెట్టి

పన్నులు విధించడం; కరెంట్ ఛార్జీలు పెంచబోతున్నామని, కరెంట్ సరఫరాను 13 గంటల నుంచి 9 గంటలకు తగ్గిస్తున్నామని ప్రకటించడం; కొత్తగా ప్రభుత్వ ఉద్యోగాలు ఇచ్చేది లేదని తెల్చి చెప్పడం వంటివేనని పరిశీలకుల అంచనా. చంద్రబాబుపై ఎంతో నమ్మకంతో, ఎన్నో ఆశలతో జనం ఓట్లు వేశారు. కాని ఆయన మాత్రం ఏరుదాటిన తర్వాత తెప్ప తగలేసినట్లు ప్రవర్తి... దానితో ప్రజలలో ఏర్పడిన నిరాశ, నిస్పృహలే నిరసనలుగా రూపాంతరం చెందాయని భావిస్తున్నారు. ఎంత నిరసన చెప్పినా చంద్రబాబుకు ఇప్పట్లో ఒరిగేదేమీ లేదు; ప్రమాదమూ లేదు. కాకి అరుస్తుంటే కుక్క మొరుగుతున్నట్లు జనం గోల చేస్తూనే వుంటారు; ఆయన తన పని తాను చేసుకు పోతూ వుంటారు. రానున్న ఐదేళ్లలో ఇదే పరిస్థితి.

# పిల్లల పార్క్ పేరుపై ఎందుకీ అనవసర రభస?

పేరులోన ఏ మున్నది పెన్నిధి అని ప్రశ్నించిన పాత కాలం పెద్ద మనిషి ఎవరో కానీ, ఆయనే ఇప్పుడు బ్రతికి నెల్లూరుకు వస్తే పేరు తెచ్చే తంటా ఎంత పెద్దదో చూసి మూర్ఛపోవడం ఖాయం. ఒక్కొక్కసారి చిత్ర విచిత్ర సంగతులు కూడా రాజకీయ గానుగలో పడి నలిగి పెను తుఫాను వలె మారిపోతుంటాయి. చింతారెడ్డి పాళెం రొంకలో నిర్మింతమౌతున్న జన్మభూమి చిల్డ్రన్స్ పార్క్ పరిస్థితి అదే ఇప్పుడు. జన్మభూమి పథకానికి శాశ్వత చిహ్నంగా ఏదో ఒక గుర్తుండే పని చేయాలనే ఆలోచన కలెక్టర్ శ్రీమతి వై. శ్రీలక్ష్మిలో కలిగింది. అప్పటికి మునిసిపల్ ఛైర్మన్‌గా వుండిన ఆనం వివేకానంద రెడ్డి ఆమెకు సహకరించారు. వీరిద్దరి ఆలోచనల్లో నుంచి పిల్లల పార్క్ పుట్టింది. పెంట దిబ్బలుగా వుండిన స్థలం కాస్తా ఒక్క వారం వ్యవధిలో చదునైన మైదానంగా మారిపోయింది. ఈ లోగా వారితో జివిఎస్ రెడ్డి జత కలిశారు. కాంట్రాక్టుల కుబేరుడైన జివిఎస్ రెడ్డి నెల్లూరులో ఏదో ఒక మంచి పని చేయాలనే తపనతో వుండినారు. ఆ స్ఫూర్తితోనే ఆయన రెడ్‌క్రాస్ రక్తనిధికి, క్యాన్సర్ క్లినిక్‌కు పది పది లక్షల విరాళం ఇచ్చారు. ఆయనలోని ఉత్సాహం చూసి కలెక్టర్ గారు పిల్లల పార్క్ పని అప్పు జెప్పారు. ఆయనా సంతోషంగా సవాల్‌గా స్వీకరించి దాన్ని అందంగా తీర్చిదిద్దారు. మోజిక్ ఫౌంటెన్, స్కేటింగ్ రింగ్, స్విమ్మింగ్ పూల్ వంటి ఆధునిక అలంకారాలతో పార్క్‌కు ఎక్కడలేని శోభ తెచ్చారు. పెద్ద పెద్ద సిటీలలో సైతం ఇంతటి సౌకర్యాలు కల్గిన పార్కు లేదు. నెల్లూరుకు చెప్పుకోదగిన అలంకారం ఇది.

ఏడాది పై నుంచి పార్క్ నిర్మాణం పని కొనసాగుతూ వుంది. ఇంతకాలం దానికి ఏ పేరు పెట్టాలో ఎవరూ ఆలోచించ లేదు.

## ఏ.సి. సుబ్బారెడ్డి పేరును వివాదాస్పదం చేయడం విచారకరం - గర్హనీయం!

వివేకానంద రెడ్డి ఎమ్మెల్యేగా గెలవగానే, మునిసిపాలిటీలో ఒక తీర్మానం ప్రవేశ పెట్టి, దానికి ఎసి సుబ్బారెడ్డి పార్కు అని నామకరణం చేయాలని ప్రతిపాదించారు. అందుకు అప్పుడెవరూ అభ్యంతరం చెప్పలేదు. కాని ఇప్పుడు అభ్యంతరం ఎదురైంది. ఎసి పేరుతో ఇప్పటికే టౌన్‌లో చాలా సంస్థలున్నాయి కాబట్టి, దీనికి సింహపురి పార్కు అని పేరు పెట్టాలని జివిఎస్ రెడ్డిగారు ప్రతిపాదించారు. నెల్లూరు తిక్కన పుట్టిన స్థలం కాబట్టి, ఆ మహాకవి స్మృత్యంకం ఏదీ నెల్లూరులో లేదు కాబట్టి ఆయన పేరు పెట్టడం సముచితమని కలెక్టర్ భావించారు. వివేకానంద రెడ్డి తాను ముందడుగు వేశాను కాబట్టి, వెనక్కు తగ్గే ప్రశ్నే లేదని మొండి కేశాడు. పిల్లుల మధ్య పోరు పిల్లి తీర్చినట్లు మంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి సైగ్గా రంగప్రవేశం చేసి మునిసిపల్ కౌన్సిల్ చేసిన తీర్మానాన్ని ప్రభుత్వం చేత రద్దు చేయించి తిరిగి పేరు ఖాయం చేశారు. దానితో ఇది రాజకీయ రంగు పులుముకున్నది. మునిసిపల్ కౌన్సిల్ తీర్మానం రద్దు కోసం ప్రభుత్వం విడుదల చేసిన జిఓలో ఎసి సుబ్బారెడ్డిని కించ పరుస్తూ వ్యాఖ్యలు చేయడం పట్ల వివేకానంద రెడ్డి ఉగ్రుడైనాడు. పంతాలు పెరిగిపోయాయి; రచ్చ తారాస్థాయి నందుకొన్నది.

కౌన్సిల్ తీర్మానం రద్దు చేసే అధికారం ప్రభుత్వానికి వుంది, దానికెవరూ అడ్డం చెప్పలేదు. అయితే అందుకు ఏదో ఒక కారణం చూపాలి కాబట్టి - "ఎసి పేరు పెడితే శాంతి భద్రతల సమస్య తలెత్తే ప్రమాదం వుందని; ఆయన వివేకానంద రెడ్డికి బంధువు కాబట్టి రాజకీయ వర్గ సమస్య ఏర్పడుతుందని, అందువల్ల ఆ పేరు తొలగిస్తున్నామని" పేర్కొన్నారు. ఎసి సుబ్బారెడ్డిని వివేకానంద రెడ్డి బంధువుగా చూడడం అత్యంత విచారకరం. పేరు పర్వతం వంటి వ్యక్తిత్వం కల్గిన మహానేత ఎసి; తర్వాత వచ్చిన వారంతా ఆ చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకునే వారే తప్ప, తమ ప్రతిభతో ఆయనకు గుర్తింపు తెచ్చిన వారెవ్వరూ లేరు. ఒక పార్కుకు పేరు పెట్టినంత మాత్రాన ఆయన ప్రతిష్ట పెరగదు; పెట్టకపోతే కళంకం రాదు. ఆ తరం మనుషుల గుండెల్లో కొలువు దీరిన నేత ఆయన. నెల్లూరు జిల్లాకు ఒక రూపం, ఒక గుర్తింపు, ఒక గౌరవం తెచ్చినవాడు. అటువంటి మహనీయుణ్ని ఇంత స్వల్ప విషయంలో వివాదంలోకి లాగడం తప్పు.

పార్కు నిర్మాణంలో ముగ్గురూ కలిసి పనిచేశారు. పేరు నిర్ణయంలోనూ ముందుగానే ముగ్గురు కలిసి కూర్చొని మాట్లాడుకొని వుంటే ఇంత సమస్య వచ్చేది కాదు కదా ? పార్కు నిర్మాణ సారథిగా శ్రమపడిన వాడు కాబట్టి, జన్మభూమి పథకం నియమం ప్రకారం 30 శాతం నిధి కంట్రిబ్యూట్ చేసిన దాతగా తాను తన పేరు పెట్టుకుంటానని జివిఎస్ రెడ్డి నిర్మొగమాటంగా మొదటే మాట్లాడి వుండినా; ఇదొక ప్రత్యేక తరహా ప్రాజెక్టు కాబట్టి దానికి సముచిత నామకరణం జరగాలని కలెక్టర్ గారు ఒక సమావేశం ఏర్పర్చి, పదిమంది సలహాలు అడిగి వుండినా; ఎసి శత జయంతి వత్సరం కాబట్టి 23 ఏళ్లకు పైగా మునిసిపల్ ఛైర్మన్‌గా పనిచేసిన నేతకు మునిసిపల్ సంస్థను అంకితం చేయడం సమంజసమని వివేకానంద రెడ్డి ప్రతిపాదించి వుండినా సాఫీగా నిర్ణయం జరిగి వుండేది - ఎవరికి వారు దాపరికంతో వ్యవహరించి, చివరి కొచ్చేసరికి కోరికలు దాచుకోలేక పోవడం తప్పు. ఇటువంటి వివాదాలలో ఎప్పుడూ రాజకీయ వాదులదే పై చేయి కావడం సహజం. ఎసి మీద వ్యాఖ్యలు వివేకానంద రెడ్డికి పెద్ద ఆయుధం. మునిసిపల్ కౌన్సిల్‌లో మెజారిటీ ఆయనదే. ఆ ధైర్యంతోనే మునిసిపల్ కౌన్సిల్ అత్యవసర సమావేశం పిల్చి, మరొకసారి అదే తీర్మానం చెయించే ప్రతిపాదన చేశారు. సిపిఎం వంటి పార్టీలూ ఎసిని కించ పరచడం తప్పు అనే అభిప్రాయంతో వివేకాను సమర్థించాయి.

ఇటువంటి విషయాలలో పంతాలు, పట్టింపుల కంటే - చర్చలు, సంప్రదింపులు పని సానుకూలం చేస్తాయి. ఆ సూక్ష్మం తెలుసుకోకుండా ప్రవర్తిస్తే రచ్చలు తప్పవు. ఇంతటితోనైనా దీనికి ఫుల్‌స్టాప్ పెట్టండి. ఎవరి పేరు పెట్టినా - అసలు పార్కు నిర్మించాలనే తలంపు చేసిన కలెక్టర్ గారి సదుద్దేశాన్ని; తన వ్యాపార వ్యవహారాలు వదిలేసి ఏడాది కాలం వెట్టి చాకిరీ చేసిన జివిఎస్ రెడ్డి శ్రమను సముచిత రీతిలో గుర్తించడం, సరైన ప్రాయశ్చిత్తం ఏర్పర్చడం న్యాయం! ఆ గుర్తింపు కోరడానికి వారు మొగమాట పడితే వివేకానంద రెడ్డే అందుకు ప్రతిపాదన చేయడం బాగుంటుంది.

## ఉత్తరక్రియలు



పెళ్ళకూరు జనార్దనమ్మ

నా భార్య

# పెళ్ళకూరు జనార్దనమ్మ

31.12.1999 తేది శుక్రవారం స్వర్గస్తురాలైనది.
ఆమెకు శ్రద్ధాంజలి ఘటిస్తూ,

**కర్మక్రతువులు**

| | | |
|---|---|---|
| 12.1.2000 తేది | బుధవారం | నిలువు |
| 13.1.2000 తేది | గురువారం | పెద్దకర్మ |

నెల్లూరు, దర్గామిట్ట, రాజరాజేశ్వరి దేవాలయం వెనుక 9వ వీధిలో, మా ఇంట్లో జరుగును. బంధు మిత్రులు తెలియగోరుతాము.

**భ: పెళ్ళకూరు వెంకటనారాయణరెడ్డి**

తల్లి: రంగమ్మ    చెల్లెలు : జయలక్ష్మమ్మ

కుమారులు : మహేష్‌రెడ్డి, మహీధర్ రెడ్డి

కోడళ్ళు : పద్మ, భవాని

కుమార్తెలు : ప్రసూన, లక్ష్మి

అల్లుళ్ళు : వాసిరెడ్డి ప్రభాకరరెడ్డి, కనుపూరు మోహన్ రెడ్డి

మనుమళ్ళు : నవీన్, సురేష్, పవన్, ప్రదీప్, సంతోష్

మనుమరాళ్ళు : లీనా, దీప్తి, వినూష

# చేతకాని ప్రభుత్వం

వాజ్‌పాయి ప్రభుత్వం దేశం పరువు తీసింది; కాందహార్ విమాన హైజాకింగ్ దుర్ఘటనలో చేతకాని తనంతో వ్యవహరించి యావత్ జాతి తలదించుకోవలసిన పరిస్థితి సృష్టించింది; ప్రపంచ దేశాల ముందు నగుబాట్ల పాల్జేసింది. అపారమైన సైనిక సంపత్తి, సుశిక్షిత కమెండో బలగం, ఎవరికీ తీసిపోని యుద్ధ నైపుణ్యం కల్గిన మనం ఆఫ్టరాల్ ఐదుగురు హైజాకర్ల వత్తిడికి నిస్సహాయంగా లొంగిపోయాం. బేలతనంతో ఓటమి అంగీకరించాం. యాభైఏళ్ల దేశ చరిత్రలో ఇంతటి అవమానకర పరిస్థితి ఎప్పుడూ లేదు.

హైజాక్‌అయిన విమానం అమృతసర్‌లో ఆగినప్పుడు నిర్లక్ష్యం చేయడం ప్రథమ తప్పిదం. దాదాపు 90 నిమిషాల వ్యవధి వుండినా కేంద్ర ప్రభుత్వ ఉన్నతాధికారులు జడులవలె వుండిపోయారు. ఆ సమయానికి పాట్నాలో వుండిన ప్రధాన మంత్రికి సమాచారం అందచేయడమూ వీరికి చేతకాలేదంటే - ప్రభుత్వం ఎంత బలహీనమైనదో అర్థం చేసుకోవచ్చు. కనీసం దుబాయ్‌లోనైనా విమానాన్ని నిర్బంధించి వుండవచ్చు. ఒక రాత్రంతా అక్కడ విడిదిచేసిందది.

అప్పుడు సమయం చాలలేదని సర్దిచెప్పుకున్నా, ఆఫ్ఘనిస్తాన్‌లో వారం రోజుల పాటు విమానం హైజాకర్ల చెరలో వుంటే ఏమీ చేయలేక పోయారు. ఆఫ్ఘన్ పాలకులను మంచి చేసుకొని వుంటే ఎంతో ఉపయుక్తంగా వుండేది. దాన్ని కూడా వదిలేద్దాం; కనీసం హైజాకర్లతో సంప్రదింపులైనా సక్రమంగా చేశారా అంటే అదీ లేదు. ఢిల్లీ నుంచి వెళ్లిన ప్రతినిధి బృందం ఐదు రాత్రులు, పగళ్లు హైజాకర్లతో సంప్రదింపులు జరిపింది. కాని ఆ హైజాకర్లు ఎవరో, వారి పేర్లు ఏమిటో, వారు ఏ దేశానికి చెందినవారో తెలుసుకోలేక పోయారు. హైజాకర్లు విమానం నుంచే శాటిలైట్ ఫోన్సులో ఎవరెవరితోనో సంప్రదింపులు జరుపుతున్నా - ఆ సమాచారం రాబట్ట లేకపోయారు. శాటిలైట్ ఫోన్‌లో ఎవరు ఎక్కడ నుంచి ఏమి మాట్లాడినా స్పష్టంగా టాప్ చేసే సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో వుండీ వుపయోగపెట్టు కోలేకపోయారు. దీనితో ఇప్పుడు హైజాకర్లపై ఎటువంటి చర్యా తీసుకొనే వీలు లేకుండా పోయింది. వారు పాకిస్తానీయులని మన ప్రభుత్వం ప్రకటిస్తే అది నిరూపించండి చూద్దాం అని ఎగతాళి చేశారు పాకిస్తాన్ మంత్రులు.

హైజాకర్లు అడిగిన ముగ్గురు తీవ్రవాదులను బేషరతుగా విడిచిపెట్టడం పోలీసు, సైనిక యంత్రాంగానికి తలకొట్టేసినట్లుగా వుంది. ఈ ముగ్గురిని పట్టుకోవడానికి జరిగిన ఎన్‌కౌంటర్లలో ప్రాణాలర్పించిన సెక్యూరిటీ సిబ్బంది ఆత్మలు ఘోషించే ఓటమి పరాభవం అది. ఈ ముగ్గురి తీవ్రవాద చర్యల వల్ల ఎందరి ప్రాణాలు గాలిలో కలిసిపోయి వుంటాయో లెక్కించలేము. పైపెచ్చు వారిని తమ విమానంలో వెంటబెట్టుకొని వెళ్లి మరొక తీవ్ర పొరపాటు చేశాడు విదేశీమంత్రి జస్వంత్ సింగ్. వారికి బాడీగార్డు వలె వ్యవహరించారాయన. ఈ తీవ్రవాదులతో పాటు దాదాపు 15 మిలియన్ డాలర్ల (67 కోట్ల రూపాయలు) నిధి సైతం రహస్యంగా హైజాకర్లకు అందించారని వినికిడి. అంతకంటె ఘోరమైన అవమానం మరొకటి వుండదు. సాక్షాత్తు సీనియర్ బిజెపి నేత, హోం మంత్రి అద్వానీ ఈ బేషరతు దాసోహానికి నిరసన తెల్పారంటే హైజాకింగ్ వ్యవహారంలో కేంద్ర ప్రభుత్వం ఎంత అసందర్భంగా, అసమంజసంగా వ్యవహరించిందీ అర్థం చేసుకోవచ్చు.

ప్రపంచంలో ఎన్నో తీవ్రవాద సంస్థలు ఎన్నో సార్లు విమానాలను హైజాక్ చేశాయి. కాని ఎప్పుడూ, ఏ సంఘటనలోనూ ఏ ప్రభుత్వం హైజాకర్ల షరతులకు లొంగిన సాదృశ్యం లేదు. విమానం హైజాకింగ్‌లో ఒక అమాయకుడి ప్రాణం పోయిన ఘటనా ఇదే. భారత ప్రభుత్వం అందువల్లనే ప్రపంచం దృష్టిలో చులకనైపోయింది.

బిజెపి పాలకుల అసమర్థ ప్రవర్తనకు, అవ్యక్త ప్రేలాపనకు మరొక నిదర్శనం - పాకిస్తాన్‌ను తీవ్రవాద దేశంగా ప్రకటించాలని ప్రధాన మంత్రి వాజ్‌పాయి ప్రకటన చేయడం. ఎంతో సున్నితమైన ఆ అంశంపై ముందు వెనుకలాలోచించకుండా ప్రకటన చేశారాయన. ఫలితం - నగుబాటు! అటువంటి విజ్ఞప్తులు తాము పట్టించుకోబోమని అమెరికా స్పష్టం చేసింది; అటువంటి సాంప్రదాయమే తమకు లేదని బ్రిటన్ వెల్లడించింది. తతిమా దేశాలు వాజ్‌పాయి అభ్యర్థనకు విలువే ఇవ్వలేదు. ఎందుకింత ఎగతాళిపాలు కావడం?

దేశ పరిపాలన అంటే మిత్ర పక్షాలను బుజ్జగించడం, మంత్రి పదవులు పంచడం కాదు. దేశ భద్రత, ప్రతిష్ఠ కాపాడడం కేంద్ర ప్రభుత్వ బాధ్యత. క్లిష్ట సమయాలలో సమర్థత నిరూపించుకోగల్గినప్పుడే ప్రభుత్వ అస్తిత్వానికి గుర్తింపు కల్గుతుంది. బిజెపి నేతలకు అది చేతకావడం లేదు. తమ అసమర్థతతో కార్గిల్ సంక్షోభం సృష్టించారు వారు. కొన్ని వేల మంది సైనికుల ప్రాణాలు బలిపెట్టారు. కాశ్మీర్‌లో తీవ్రవాదం అణచివేతలో విఫలమౌతున్నారు. తమ వైఫల్యం వల్ల ఆ సమస్యకు అంతర్జాతీయత సంతరించి పెడుతున్నారు. కాశ్మీర్ విషయంలో మూడవ దేశం జోక్యం లేకుండా; ఏ అంతర్జాతీయ వేదికపైనా అది చర్చకు రాకుండా జాగ్రత్త పడుతూ వచ్చాయి ఇన్నేళ్లుగా కాంగ్రెస్ ప్రభుత్వాలు. విమానం హైజాకర్లకు దాసోహమనడం, వాజ్‌పాయి అసందర్భ ప్రకటన చేయడం - ప్రతి ప్రపంచ దేశమూ కాశ్మీర్ గురించి మాట్లాడే పరిస్థితి కల్పించాయి. దురదృష్టకర పరిణామం ఇది. దీని ప్రభావం భవిష్యత్ కాశ్మీర్ పరిణామాలపై తీవ్రంగా వుండబోతుంది.

జమీన్‌రైతు

ఇప్పటికైనా వాజ్‌పాయి, ఆయన మంత్రులు తమ తప్పిదం గుర్తిస్తే ఎంతో మేలు జరుగుతుంది. పాకిస్తాన్ దుశ్చర్యలను ప్రతిఘటించడంలో అంతర్జాతీయ సహకారం అవసరమనుకొంటే అందుకు ఎంతో సమాచార సేకరణ జరపాలి. పాకిస్తాన్ గూఢాచారి సంస్థల దుర్మార్గాలు; వారు తీవ్రవాదులకు ఇస్తున్న శిక్షణ, సరఫరా చేస్తున్న ఆయుధాలు; తీవ్రవాదుల చేత హత్యాకాండలు జరిపించడానికి వారు ఇస్తున్న ఆదేశాలు తదితర వాటిపై ఆధారాలు సేకరించి, దౌత్యమార్గాలలో ప్రపంచ దేశాలను వప్పించాలి. ఉత్తుత్తి ప్రకటనలతో పని జరగదు. క్లిష్ట సమయాలలో సైన్యం, పోలీసు యంత్రాంగాలను సమర్థవంతంగా వినియోగించుకోవడంలో ప్రధానితో సహా ప్రతి ప్రభుత్వనేతా శిక్షణ పొందడం అవసరమన్పిస్తున్నది. *

---

## 50 ఏళ్లక్రితం ఈ వారం

జమీన్‌రైతు

6.1.50

వెల: 0-2-0 పేజీలు: 12

### విద్యార్థి కాంగ్రెస్‌లో విభేదాలు

జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఈ చీలికలకు విషయాల కంటె వ్యక్తులు, ఆశయాల కంటె ఆశలు హెచ్చడమే కారణంగా కనపడుతుంది. శ్రీ మునిరెడ్డిని ఆర్గనైజింగ్ కార్యదర్శిగా విద్యార్థి కాంగ్రెసుకు రాష్ట్ర కాంగ్రెసు నియమించడంతో ప్రారంభమయ్యిందట. వ్యక్తిపరమయిన విభేదాలు, నెల్లూరు జిల్లాలో గ్రూపు రాజకీయాలను మనస్సులో పెట్టుకొని ఆయనజిల్లా విద్యార్థి కాంగ్రెసు కమిటీని రద్దు చేశాడని, శ్రీ ఎసి. సుబ్బారెడ్డి గారి బంధువు సంజీవరెడ్డి అనే విద్యార్థిని జిల్లా నాయకుడు చేయాలనే ఉద్దేశ్యంతో చేశాడని అంటారు.

### చందాలివ్వని పెద్దలు

శ్రీ మారం కోటిరెడ్డిగారు
రాజానగరం, తాళ్లూరుపోస్టు

ఆర్యా! తమ చందాకు 5 మారులు కార్డులు, 6మారులు విపిలు పంపబడినవి. జవాబేలేదు. పత్రికలు చదువుకొని చందాలు ఎగ్గొట్టడం విచారకరం. పత్రిక అక్కరలేకపోతే అంతవరకు చందా పంపి ఒక కార్డు గీకెయ్యండి. అంతేకాని ఈ విధంగా చెయ్యడం పెద్దమనిషి తరహాకాదు. ఇంతటనైనా నిలవచందా పంపి సహాయపడ ప్రార్థన. ఇతరులు గూడా దీనిని గమనించప్రార్థన.

- నెల్లూరు వెంకటరామానాయుడు
పత్రికాధిపతి

### విశాలాంధ్ర రాజకీయాలు

సవ్యసాచి

#### కాంగ్రెస్ భవనాల్లో కనకవర్షం

కాలం మారిపోయింది. ఇప్పుడు రాష్ట్ర కమిటీ మెంబరు కావాలంటే క్వాలిఫికేషనా? డబ్బా? అనే ప్రశ్న పుడుతున్నది. కాంగ్రెస్ భవనాల్లో వారం రోజుల నుండి కనకవర్షం కురుస్తున్నది. ఈ వర్షాన్ని కురిపించేవాళ్లుగాని మెంబర్లుగా రాలేదంటూ నాలుక చప్పరిస్తున్నారు కొందరు.

డబ్బులిచ్చి చేర్పిస్తే మాత్రం వారెలావస్తారో చూతామంటున్నారు అసలు కాంగ్రెస్‌వాళ్లు భవిష్యత్తున్నది

తరువాత 11వ పేజీలో

---

## జనవాణి

# నేతల్లారా! రైతులకు ద్రోహం చెయ్యొద్దు!

సోమశిల ప్రాజెక్ట్‌లో 17టిఎంసిల నీరుంటే దీనిలో కొంత నీటిని తెలుగు గంగ ప్రాజెక్ట్ కాల్వల ద్వారా మద్రాసుకు మంచినీటి సమస్య తీర్చను పంపారు. మరికొంత నీటిని కావలి కాలువ ద్వారా కావలికి తరలిస్తూ డెల్టా ప్రాంతాలైన కోవూరు, సర్వేపల్లి రైతులకు తీరని అన్యాయం చేస్తున్నారు. 2లక్షలా 50వేల ఎకరాల ఆయకట్టున్న కనిగిరి రిజర్వాయరు పరిధిలో లక్షా 30వేల ఎకరాల్లో మాత్రమే నాట్లు వేయమని కలెక్టర్ నోటీసు జారీ చేయడం అన్యాయం. 1995లో డిశంబరు నెలలో సోమశిలలో 17టిఎంసిల నీరు నిల్వ వున్నప్పుడు కోవూరు రైతులు పోరాటం చేస్తే అప్పుడు మంత్రిగావున్న రమేష్‌రెడ్డి రాష్ట్ర ప్రభుత్వంతో మాట్లాడి 2లక్షలా 50వేల ఎకరాల్లో పంట పండేట్లు చేయించారు. సోమశిలలో డెడ్ స్టోరేజి నీరు పోను, మిగతా నీటిని వాడుకొనే హక్కు డెల్టా రైతులకు మాత్రమే వుంది. కాని డెల్టా రైతులకు ఈ విధంగా ద్రోహం చేయడం తగదు.

*గంగవరం* *జి.రామకృష్ణప్రసాద్*

### టౌన్ బస్సుల ఛార్జీలు తగ్గించాలి

నెల్లూరు టౌన్‌బస్సుల్లో ఛార్జీలు విపరీతంగా పెంచారు. ఎన్టీఆర్ నగర్ నుండి అయ్యప్పగుడి వైపు వెళ్లే ఎస్.ఎం.ఎల్.టి. బస్‌లో బాలాజీనగర్ నుంచి రాజరాజేశ్వరి గుడి వరకు 5 రూపాయలు వసూలు చేస్తున్నారు. బాలాజీనగర్‌కు రాజరాజేశ్వరి గుడికి 5 కిలోమీటర్ల దూరం మాత్రమే

తరువాత 11వ పేజీలో

# నీళ్ల లెక్కల్లో దాపరికమెందుకు?

సోమశిల ప్రాజెక్టులో నీటి నిల్వ విషయమై నీటిపారుదల శాఖాధికారులు వాస్తవాలను దాస్తున్నట్లనిపిస్తుంది. 2వతేది వరకు ప్రాజెక్టులో 13.5 టిఎంసి నీరు మాత్రమే నిల్వ వుందని ప్రకటించిన

## ఎందుకీ వంచన?

అధికారులు 5వతేదికి మాట మార్చి 18.5 టిఎంసిల నీరు వున్నట్లు ప్రకటించారు. ఇప్పటి వరకు విడుదల చేస్తున్న నీటిని 2వేల క్యూసెక్కులకు పెంచుతున్నట్లు చెప్పారు. ముఖ్యమంత్రి, ఇరిగేషన్ మంత్రితో చర్చించాక మరో 500 అంటే 2,500 క్యూసెక్కులకు నీటిపారుదల పెంచేందుకు ప్రయత్నిస్తామని తెలుగుగంగ సిఇ ఆర్. సత్యనారాయణ హామీ ఇస్తున్నారు. అధికారుల లెక్కల ప్రకారం ప్రాజెక్ట్ డెడ్ స్టోరేజి 7.5 టిఎంసిలు పోతే, ప్రాజెక్ట్ ద్వారా 11 టిఎంసిల నీరు విడుదల చేయవచ్చు. మరో రెండు టిఎంసిల నీరు ప్రాజెక్టుకు పై నుంచి వచ్చి చేరే అవకాశాలున్నాయి. అంటే ప్రాజెక్టులో 20 టిఎంసిల నీళ్లు ప్రాజెక్టులో

తరువాయి 12వ పేజీలో



నూతన సంవత్సర శుభవేళ తన సోదరుడు వివేకానందరెడ్డికి కేకు తినిపిస్తున్న రామనారాయణరెడ్డి. ప్రక్కన వారి కవల సోదరులు జయకుమార్, విజయకుమార్. ఈ కార్యక్రమ నిర్వాహకుడు రూబెన్.

# జడ్పీపి సమావేశంలో ఎమ్మెల్యే బ్రదర్స్ ధూంధాం

చాలా రోజులు ఇంకా చెప్పాలంటే సంవత్సరాల తర్వాత, జడ్పీ సమావేశాలు వాడిగా వేడిగా జరుగుతున్నాయి. పాలకపక్ష లేదా అధికారుల ఒంటెద్దు పోకడలను ఎమ్మెల్యే బ్రదర్స్ సమర్థవంతంగా నిలువరిస్తున్నారు. 2వ తేది జరిగిన సమావేశంలో రామనారాయణరెడ్డి, వివేకా దెబ్బకు అధికారులు నిలువు గుడ్లేశారు. కాంగ్రెస్ పార్టీకి చెందిన ముగ్గురు ఎమ్మెల్యేలు సమావేశానికి హాజరుకావడంతో పాటు వారు నిర్మాణాత్మకంగా చర్చల్లో పాల్గొనడంతో పాలక పక్షం ఇరుకున పడింది. కాంగ్రెస్ ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి, వివేకానందరెడ్డి కృష్ణయ్య కరవు, నీటిపారుదల, వివిధ స్కూళ్లలో టీచర్ల భర్తీ విషయమై అధికారులను నిలదీశారు. అనుభవజ్ఞుడు కాబట్టి చర్చల్లో సింహభాగం రామనారాయణరెడ్డిదే. 2వతేది జరిగిన జిప సమావేశానికి చట్టబద్ధత లేదని అటువంటి సమావేశాన్ని సిఇఓ ఎందుకు పెట్టాల్సి వచ్చిందని రామనారాయణరెడ్డి పలు విధాలుగా ప్రశ్నలు గుప్పిస్తూ అధికారులను తికమక పెట్టినప్పుడు, అందరినీ ఆశ్చర్యపరుస్తూ మాజీమంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కూడా ఎమ్మెల్యే బ్రదర్స్‌తో జత కలిసారు. తొలి సమావేశం కావడంతో మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మౌనముద్ర దాల్చి ప్రతి విషయాన్నీ జాగ్రత్తగా పరిశీలించారు. అధికారులు చట్టబద్ధతలేని సమావేశం ఏర్పాటు చేసినందుకు సభ్యులకు జిప ఛైర్మన్ నెల్లూరు కౌసల్య క్షమాపణ చెప్పాల్సి వచ్చింది. తొలుత 31తేది ఏర్పాటు చేసిన సమావేశాన్ని 2తేదికి ఎందుకు మార్చారో సిఇఓ తనకు తెలియజేయలేదని ఏందు సభలో చెప్పారామె. జిపలో సిఇఓ ఏకపక్ష పాలనకు ఛైర్మన్ ప్రకటనే సాక్ష్యమనాలి.

మాజీ రాష్ట్రపతి శంకర్ దయాళ్ శర్మ మృతికి సంతాప సూచకంగా సభ్యులు ఒక నిమిషం మౌనం పాటించాక జరిగిన చర్చలో మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, ఎమ్మెల్యేలు చంద్రమోహన్‌రెడ్డి, వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి పాల్గొన్నారు. చర్చ ముగిశాక ఛైర్మన్ సభను కొనసాగించాలని ప్రయత్నించినప్పుడు రాపూరు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి అభ్యంతరం వ్యక్తం చేశారు. వ్యాలిడిటీ లేని ఈ సమావేశంలో తీసుకొనే నిర్ణయాలపై ఎవరైనా కోర్టుకువెళితే అవి చెల్లవు. సిఇఓ సంతాప తీర్మానాలకే సమావేశం పరిమితమని ఫోన్లో చెప్పారు. ఇప్పుడెందుకు కొనసాగిస్తున్నారో అర్థం కావడం లేదన్నారు. కాంగ్రెస్ ఎమ్మెల్యేలు డిసెంట్ నమోదు చేసి తర్వాత సమావేశం నిర్వహించమన్నారు. 90 రోజుల్లో సమావేశం జరపకుంటే సమావేశం రద్దవుతుందని అందువల్ల పెట్టక తప్పలేదన్న సిఇఓ దామోదరం చెబుతుండగా మాజీమంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి అడ్డుకున్నారు. ఎమ్మెల్యేలను తప్పు త్రోవపట్టించవద్దని ఆవేశంగా సలహా యిచ్చారాయన. ప్రతినెలా

## నిలువు గుడ్లేసిన అధికార గణం

మీటింగ్ పెడతామని ఛైర్మన్ చెప్పిన మాట నిలబెట్టుకోలేదని నెల్లూరు రూరల్ జడ్పీటిసి సభ్యుడు హంసకుమార్‌రెడ్డి ప్రస్తావిస్తున్నప్పుడు సిఇఓ దామోదరం ఆయనను కూర్చోమన్నారు. దీంతో నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఉగ్రుడయ్యారు. ఎందయ్యా సభ్యుడ్ని కూర్చోమంటావ్... సిఇఓ? ఆ హక్కు నీకెక్కడుందని నిలదీసే సరికి బిక్క మొఖం వేశారాయన. సమావేశాన్ని రాజ్యాంగబద్ధంగా జి.ప. ఛైర్మన్ నిర్వహించాలని సుతిమెత్తని చురక అంటించారాయన. సమావేశం కూడదన్న రామనారాయణ చర్చకు గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ అడ్డుతగిలి సమావేశం కొనసాగించేందుకు ఛైర్మన్‌కు కొన్ని ప్రత్యేక హక్కులున్నాయని చెప్పగా ఎమ్మెల్యే నేను న్యాయశాస్త్రాన్ని మీకన్నా ఒక్క సంవత్సరం ముందు చదివాను, సీనియర్‌నని చెప్పడంతో మారుమాట్లాడకుండా కూర్చొన్నారాయన.

జిల్లాలో వివిధస్కూళ్లలో టీచర్ల ఖాళీల వివరాలను నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రస్తావించారు. దీనికి డిఇఓ ప్రభాకరరెడ్డి సమాధానం చెప్పారు. జిల్లాను కరవు ప్రాంతంగా ప్రకటించినా విద్యార్థుల వద్ద ఫీజులు వసూలు చేస్తున్న విషయాన్ని వివేకానందరెడ్డి సభ దృష్టికి తీసుకొచ్చారు. ఫీజులు వసూలు చేయవద్దని ఆదేశాలు రానట్లు డిఇఓ చెప్పారు. ఆదేశాలు అందగానే ఫీజులు తిరిగి చెల్లిస్తామని కలెక్టర్, వివేకానందరెడ్డికి హామీ ఇచ్చారు. ఆదరణ పథకం గూర్చి చర్చ జరిగినప్పుడు రామనారాయణరెడ్డి ఈ పథకం అర్హులకు ఉపయోగపడలేదన్నారు. దీనికి కలెక్టరే సమాధానం ఇచ్చారు. పథకాన్ని ప్రభుత్వం ఆపడం వల్ల నెల్లూరు మునిసిపాలిటీ పరిధిలో పరికరాలు ఇవ్వలేక పోయినట్లు చెప్పారు. ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య సోమశిల ప్రాజెక్టులో నీటి సామర్థ్యం విషయమై అడిగినప్పుడు, సర్వేపల్లి ఎమ్మెల్యే చంద్రమోహన్‌రెడ్డి నీటిపారుదల శాఖ డిప్యూటీ ఎస్.ఇ. కన్నా చక్కని గణాంకాలను సభ ముందుంచారు. సభకు తొలిసారిగా వచ్చిన నెల్లూరు ఎమ్పీ డాక్టర్ ఉక్కాల రాజేశ్వరమ్మ పొరపాటున కూడా నోరు తెరచే ప్రయత్నం చేయలేదు. ఎమ్మెల్యేలు కంభం విజయరామిరెడ్డి, వంటేరు వేణుగోపాలరెడ్డి సమావేశంలో పాల్గొన్నారు. సమావేశం 4 గంటలకుపైగా కొనసాగింది.

## క్షయరోగులకు దుప్పట్లు పంపిణీ

మాతృశ్రీ శారదాదేవి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరులోని శ్రీరామకృష్ణ సేవా సమితి ఆధ్వర్యంలో క్షయ ఆస్పత్రిలోని రోగులందరికీ 29 దుప్పట్లు పంపిణీ చేశారు. వీటి విలువ 20వేల రూపాయలు. ఈ కార్యక్రమంలో సమితి అధ్యక్షుడు బి. చిదంబరం, ఉపాధ్యక్షులు బి.యలమందయ్య, స్థాపక కార్యదర్శి ఎన్వీ నరసింహారావు, సంయుక్త కార్యదర్శి ఎల్.నారాయణరావు, శ్రీ శారదా హైస్కూల్ కరస్పాండెంట్ సి. కృష్ణవేణి ఆస్పత్రి డాక్టర్లు భాస్కర్, శ్రీనివాసన్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# చిన్నబజారు రోడ్డుకు మోక్షం

చిన్నబజారులో అత్యంత అధ్వాన్న స్థితిలో చేరిన సిమెంట్ రోడ్డును 6లక్షలు వెచ్చించి అతిత్వరగా నిర్మిస్తామని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి హామీ ఇచ్చారు. 2వతేది మునిసిపల్ ఆఫీసులో ప్రయోగాత్మకంగా చేపట్టిన డయల్ యువర్ మునిసిపాలిటీ కార్యక్రమంలో ప్రజల ప్రశ్నలకు మంత్రి ఓపిగ్గా సమాధానం చెప్పారు. ఒక గంటా ఐదు నిమిషాల పాటు జరిగిన ఈ కార్యక్రమంలో 30మందికి పైగా టౌన్‌లోని వివిధ ప్రాంతాల ప్రజలు మంత్రిపై ప్రశ్నలు సంధించారు. చిన్నబజారులో అధ్వాన్నంగా వున్న రోడ్డును, ఆ రోడ్డుపైన చెత్త విషయమై ఆ ప్రాంత ప్రజలు మంత్రి దృష్టికి తీసుకెళ్లినప్పుడు పై సమాధానం చెప్పారు. పప్పులవీధిలో నెల రోజులుగా వీధిలైట్లు వెలగడం లేదని ఒకరు ఫిర్యాదు చేయగా, వారం రోజుల్లో వెలిగేలా చూస్తానని మంత్రి సమాధానమిచ్చారు. హరనాథపురంలో కొత్తలు, పందుల బెడద గూర్చి ఒక మహిళ ఫోన్లో తెలపగా వారం రోజుల్లో దాన్ని పరిష్కరిస్తామన్నారు. మన్సూర్ నగర్ ప్రాంతంలో రోడ్లు గుంటల మయమై వున్న విషయాన్ని తెలియజేయగా 10 రోజుల్లో మట్టి పోయించమని కమీషనర్‌ను ఆదేశించారు. బాలాజీనగర్ 15వ అడ్డరోడ్డులో మురుగునీరు నిల్చిపోయిన విషయాన్ని మంత్రి దృష్టికి తీసుకవెళ్లగా రెండు రోజుల్లో సమస్యను పరిష్కరిస్తానన్నారు. ఎసి నగర్, గర్ల్సవీధి, బృందావనం, కల్లూరుపల్లి, మూలపేట

## ఆరున్నరలక్షలతో ప్రతిపాదనలు

వాసులు తమ సమస్యలు మంత్రి దృష్టికి తీసుకవెళ్లగా అన్నింటిని వారం పది రోజుల్లో పరిష్కరిస్తానన్నారు.

ఈ కార్యక్రమం అయ్యాక మంత్రి విలేఖరులతో మాట్లాడుతూ టౌన్‌పరిధిలోని 9 ఇరిగేషన్ కాల్వలలో 25లక్షలు వెచ్చించి పూడిక తీత పనులు చేపట్టనున్నట్లు చెప్పారు. ఉయ్యాల కాల్వ, జాఫర్ సాహెబ్ కాల్వలలో పూడిక కూడా ఈ సందర్భంగా తీస్తా

తరువాయి 12వ పేజీలో

# ఎం.పి.కి కోపమొచ్చిందండీ

తన మానాన తాను పనిచేసుకొని పోయే నెల్లూరు ఎమ్పీ డాక్టర్ ఉక్కాల రాజేశ్వరమ్మకు సైతం కోపం తెప్పించారు మునిసిపల్ అధికారులు. సహస్రాబ్ది ప్రారంభాన్ని పురస్కరించుకొని నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ ఏర్పాటు చేయతలపెట్టిన స్థూపాలు, భవనాల శంకుస్థాపన కార్యక్రమాల్లో ఎమ్పీ ఉత్సాహంగా పాల్గొన్నారు. వెంకటేశ్వపురం శివార్లలో నిర్మించే మిలీనియం స్వాగత ద్వారానికి శంకుస్థాపన చేసి తిరిగి వస్తున్నప్పుడు రోడ్డుపై ఒక పంది చనిపోయి వుండడంతో ఎమ్పీ కారుదిగేశారు. చేతి రుమాలు అడ్డం పెట్టుకొని ఆ ప్రాంతమంతా కలియతిరిగి, ప్రక్కనే వున్న మునిసిపల్ కమీషనర్ వేమారెడ్డి, హెల్త్ ఆఫీసర్లపై కోప్పడ్డారు. స్థూపాలిందుకుసార్! ప్రజల ఆరోగ్యం ముఖ్యం; ఇది మీరు గమనించాలి. ఇంత మంది ప్రజాప్రతినిధులు వస్తున్నా ఈ పంది కళేబరాన్ని తొలగించని శానిటరీ ఇన్స్‌పెక్టర్ ఎవరో గుర్తించి చర్యలు తీసుకోనున్నారు. తాను ఏ కార్యక్రమం తలపెట్టినా నిందలు భరించాల్సి వస్తుందని జనవరి ఫస్ట్‌న కూడా ఇది తప్పలేదన్నట్లుగా కమీషనర్ ఇబ్బందికరంగా ముఖం పెట్టారు. పనిలో పనిగా సిపిఎం కౌన్సిలర్ మూలం రమేష్ మునిసిపల్ అధికారులకు ఇది మామూలేనని ఎమ్పీ దృష్టికి తీసుక రావడంతో, పద్ధతి మార్చుకోమని సలహా యిచ్చారామె. ఎమ్పీ కారు దిగి తమ సమస్య పట్ల స్పందించడంతో ఈ ప్రాంత ప్రజలు ఉబ్బితబ్బిబ్బులయ్యారు.

## వాస్తవాలు వ్రాయండి - ఆదాల అభ్యర్థన!

పత్రికల్లో వాస్తవాలు వ్రాస్తే సంతోషించే వారిలో మొదటి వ్యక్తి తానని ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. జనవరి 1తేదీ సోమశిల అతిథి గృహంలో విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడారు. నన్ను ముఖ్యమంత్రి మందలించినట్లు ఒక పత్రికలో వ్రాశారు; అలాంటిదేమీ జరగలేదు. ఈ వార్త వల్ల ఒకవ్యక్తి పరువు మర్యాదలకు ఎంత మేరకు భంగం కలిగిందో ఆలోచిస్తే బాగుంటుందన్నారు. నవ సహస్రాబ్ది సందర్భంగా జిల్లా ప్రజలకు మంత్రి శుభాకాంక్షలు తెలియజేస్తూ, అందరూ సుఖ సంతోషాలతో జీవనం కొనసాగించాలని ఆకాంక్షించారు. జిల్లాలో ప్రకటించిన దానికన్నా ఎక్కువ విస్తీర్ణంలో పంటవేశారు. ఈ పంట దెబ్బతినకుండా పండించేందుకు సాధ్యమైనంత కృషి చేస్తాం. సేవ్ ది క్రాప్ పథకం క్రింద గూడూరు, వెంకటగిరి ప్రాంతాలకు కండలేరు ద్వారా అర టిఎంసి నీరు సరఫరా చేస్తామన్నారు. సోమశిల ప్రాజెక్టులో నీటి సామర్థ్యం పెంచేందుకు అవసరమైన భూసేకరణకు ముఖ్యమంత్రి అంగీకరించినట్లు చెప్పారు. ఇప్పటి వరకు ప్రకటించిన కరవు నిధుల్లో కోటి రూపాయలు విడుదలయ్యాయని, మిగతావి విడుదలవు తాయన్నారు. జనవరి 31తేది మాజీ ఎమ్మెల్యే రమేష్‌రెడ్డి నేతృత్వంలో జరిగిన మిలేనియం ర్యాలీ ముమ్మాటికి పార్టీ కార్యక్రమమేనని, జిల్లా కన్వీనర్ కంభం విజయరామిరెడ్డి అందులో పాల్గొనడమే సాక్ష్యమన్నారు.

# చేనుమేస్తున్న ఎక్సైజ్ కంచె

గూడూరులోని బ్రాందీ షాపుల్లో జిల్లాలోని ఎక్సైజ్ ఉన్నతాధికారులే భాగస్వాములు కావడం వల్ల వీటి నిర్వహణలో నియమ, నిబంధనలు లేకుండాపోయాయి. గూడూరులో

## గూడూరులో విచ్చల విడితనం!

మద్యం వ్యాపారం గతంలో బాగా సాగిన చరిత్ర వుండడంతో, ఈ షాపులపై ఎక్సైజ్ అధికారుల కన్ను పడింది. ఇక్కడి ఆరుషాపులు పాడిన వ్యక్తులకు గుడ్‌విల్ ఇచ్చి నెల్లూరులోని ఎక్సైజ్ ఉన్నతాధికారి గూడూరులో పనిచేసే ఇద్దరు శాఖాధికారులు ఈ షాపులను తమస్వంతం చేసుకొన్నారు. అప్పటి నుండి విచ్చలవిడిగా మద్యం విక్రయాలు చేయిస్తున్నారు. టౌన్‌లోని ప్రతి బ్రాందీ షాపు అనుబంధంగా ఒక బారును నడుపుతున్నారు. రాత్రి రెండు గంటల వరకు ఇవి తెరిచే వుంచడం వల్ల సంఘ వ్యతిరేక కార్యక్రమాలను ప్రోత్సహించినట్లు అవుతుంది. నిర్వాహకులు అధికారులే కావడం వల్ల గ్రామగ్రామాన బెల్టుషాపులు బ్రహ్మాండంగా నడుస్తున్నాయి. కంచె చేను మేసిన చందాన, మద్యం షాపులను నియంత్రించాల్సిన అధికారులే ఈ విధంగా తయారైతే ఎలా?

## ఆత్మకూరు ఆర్టీసి బస్సులు అధ్వాన్నం

ఆత్మకూరు ఆర్టీసి డిపో గ్రామీణ

తొరవ 8వ పేజీలో



జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ఇన్నవల్లి పట్టుపుపాలెంలో పాఠశాల భవనం ప్రారంభిస్తున్న ఇళ్లమంత్రి ప్రభాకర్‌రెడ్డి, కలెక్టర్ శ్రీలక్ష్మి, ఎమ్మే రాజేశ్వరమ్మ తదితరులు.

# తెలుగుదేశం మాజీలకు జన్మభూమి కాజా!

నెల్లూరు జిల్లాలో జన్మభూమి కార్యక్రమం తెలుగుదేశం పార్టీ పండుగగా మారిపోయింది. జిల్లా అధికార యంత్రాంగం ఉచ్ఛనీచాలు మరిచిపోయి తెలుగుదేశం నేతలకు దాసానుదాసులై పోయారు. "సి బాంచన్ కాల్మొక్త" అంటూ పాదాక్రాంతులై కార్యక్రమాలను కూడా ముఖ్యమంత్రి పార్టీ కార్యక్రమాలుగా మారుస్తున్నారనేందుకు ఇదే ఉదాహరణ. అధికారులు సిగ్గు, శరం, మానాభిమానాలు వదిలేసి, మాజీల పంచెలు ఎగపట్టుకొని తిరుగుతున్నారు. వాళ్ల చెప్పులు నెత్తిమీద పెట్టుకొని మోస్తున్నారు.

## కట్టుబానిసలైన అధికార గణం!

పోయారు ఏకంగా పచ్చ చొక్కా వేసుకొని పార్టీ భజన చేస్తున్నారు. జిల్లాలో నలుగురు కాంగ్రెస్ ఎమ్మెల్యేలను ఉద్దేశపూర్వకంగా విస్మరించి, చేపడుతున్న జన్మభూమి కార్యక్రమాలు ఆ పార్టీ నేతల దురుద్దేశాన్ని చెప్పకనే చెబుతున్నాయి. జిల్లా కలెక్టర్ మొదలు కింది స్థాయి అధికారి వరకు ప్రభుత్వ నియమనిబంధనలను తుంగలో తొక్కడం ఆశ్చర్యం గొల్పుతుంది. తెలుగుదేశం అభ్యర్థులు ఓడిపోయిన ఆత్మకూరు, రాపూరు, నెల్లూరు, వెంకటగిరి నియోజక వర్గాల్లో జన్మభూమి పనుల్లో తెలుగుదేశం పార్టీ పరాజితులు, మాజీలదే పైచేయిగా వుంది. ఆత్మకూరు జన్మభూమి కార్యక్రమంలో మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడుని ఏ హోదాతో వేదిక మీదకు పిలిచారో అర్థం కావడంలేదు. అధికారుల నిర్లక్ష్యం కారణంగానే వెన్నవాడ సభలో కొమ్మి లక్ష్మయ్యనాయుడు, ఎమ్మెల్యే బొల్లినేని మధ్య ఘర్షణ జరిగి సభ రసాభస అయ్యింది. ఎన్నికల్లో ఓడిపోయినా, 'కొమ్మి' చీటీలేనిదే ప్రభుత్వ అధికారులు పనులు చేయడం లేదని వెన్నవాడ గ్రామసభలో ఒక వ్యక్తి చేసిన ఫిర్యాదు, చిలికి, చిలికి గాలివానగా మారి, ఇద్దరు కొట్టుకొనే వరకు దారితీసింది. అధికారుల అనాలోచిత ధోరణి ఎంత ప్రమాదం తెచ్చి పెట్టిందో ఈ సంఘటనే ప్రత్యక్ష నిదర్శనం. ప్రభుత్వ

నెల్లూరులో కూడా ఇదే తంత్రు కొనసాగుతోంది. మాజీ ఎమ్మెల్యే రమేష్‌రెడ్డికి బావమరిది, ఏ పదవిలేని రాజకీయ అనామకుడు ఆనందరెడ్డి చేత వృద్ధాప్య పెన్షన్లు పంపిణీ చేయించిన ఈ అధికార మధాందులను ఏమని పిలవాలో ప్రజలే నిర్ణయించు కోవచ్చు. ఒకవైపు ఎమ్మెల్యే వివేకా, మరొకవైపు ఛైర్మన్ దశయ్య జన్మభూమి కార్యక్రమాల్లో పాల్గొనగా, మధ్యలో రమేష్‌రెడ్డి కూడా దూసుకొచ్చి తనకూ ఏదో ఒక కార్యక్రమం పెట్టమని బెదిరించి, తనతోపాటు, ఆనందరెడ్డి చేత కూడా ప్రభుత్వ కార్యక్రమాలకు శ్రీకారం చుట్టించారు. చిన్నా, చితకా తెలుగుదేశం కార్యకర్తలకు కూడా వంగి, వంగి సలాం చేసి గులాములవుతున్న వాళ్లను అధికార్లు అనడంకన్నా కట్టుబానిసలని సంభోదించడమే సముచితం. ప్రభుత్వ కార్యక్రమాలు అమలు, ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలకు జిల్లా అధికార యంత్రాంగం ప్రోటోకాల్ పాటించడమే మరిచి పోయినట్లుంది. నేతల ప్రాపకం ఉంటేచాలు, ప్రోటోకాల్ నిబంధనలు తమను ఏం చేస్తాయన్న ధీమా వారిది.

బుధవారం రాపూరు నియోజక వర్గంలో జన్మభూమి కార్యక్రమాలను ఎమ్మెల్యే రామనారాయణరెడ్డికి తెలియజేకుండానే ప్రారంభించేశారు. నిబంధనల ప్రకారం

## ప్రోటోకాల్‌కు పాడి కట్టేశారు!

అయితే ఎమ్మెల్యేను సంప్రదించి నియోజకవర్గంలో కార్యక్రమాలను ఖరారు చేయాల్సి ఉంది. ఈ విషయమై గతంలో అసెంబ్లీలో కూడా గొడవ జరిగింది. అసెంబ్లీ నైతిక విలువల కమిటీ, ఎమ్మెల్యేల ప్రోటోకాల్ విషయంలో కొన్ని స్పష్టమైన సూచనలు చేసి, వాటిని విధిగా అమలు పరచాలని జిల్లా కలెక్టర్లను ఆదేశించింది. ఎమ్మెల్యేకి తెలియకుండా నియోజకవర్గంలో ఏ పనికి ప్రారంభోత్సవం, శంకుస్థాపన చేయరాదని, అభివృద్ధి కార్యక్రమాల్లో వారిదే ప్రధానపాత్రగా ఉండాలని నిర్ణయించింది.

బుధవారం నాడు మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి రాపూరు నియోజక వర్గంలో జన్మభూమి కార్యక్రమాల్లో పాల్గొంటారని మంగళవారం రాత్రి 10 గంటలకు రామనారాయణరెడ్డికి కబురు అందింది. పొదలకూరు, ముజుబుజునెల్లూరు, కనుపూరు, కందలపాడు తదితర గ్రామాల్లో కొన్ని పనులకు శంకుస్థాపనలు పెట్టారు. ఈ వివరాలు ఆయా గ్రామ పంచాయతీ సర్పంచ్‌లకు కూడా తెలియక పోవడం వల్ల ఎమ్మెల్యేతోపాటు వారు కూడా బహిష్కరించారు. కందలపాడు కొత్త ఇళ్ల కాలనీ ప్రారంభోత్సవం హౌసింగ్‌శాఖ అధికారులకు కూడా చెప్పకుండానే, గ్రామంలోని ఒక ఛోటా తెలుగునేత రూపొందించాడట. కలెక్టర్‌గారు దాన్ని మంత్రిగారి ప్రోగ్రాంలో చేర్చారు. ఎంత నామోషీతనం. కలెక్టర్ ఆమోదం

తొరవ 8వ పేజీలో

# వనసంరక్షణలో కోట్లు భక్షణ

జిల్లాలో వన సంరక్షణ సమితుల పరిరక్షణకు విడుదలైన కోట్లాదిరూపాయల నిధులను అటవీ శాఖాధికారులు పంచభక్ష పరమాన్నాల మాదిరి స్వాహా చేసినట్లు తెలిసింది. జిల్లాలో పేరుకు మాత్రం 135 వన సంరక్షణ సమితులు. వీటిలో 18వేల మంది సభ్యుల పేర్లను అటవీశాఖాధికారులు రికార్డుల కోసం నమోదు చేశారు. ఈ సమితులన్నీ విస్తారంగా వనాలను అభివృద్ధి చేస్తున్నట్లు ఈ సభ్యుల ఉపాధి కల్పనకు కుట్టుమిషన్లు, గేదెలు, బాతులు, పొగరాని పొయ్యిలు, వ్యవసాయపనిముట్లు కొన్నట్లు కోట్లాది రూపాయలు డ్రా చేసుకొన్నట్లు తెలిసింది. ఈ వ్యవహారంలో రాపూరు రేంజి అటవీశాఖాధికారులు జిల్లాలో మిగతా అధికారకంటే నాలుగాకులు ఎక్కువ తిన్నట్లు తెలిసింది. ఈ వ్యవహారంలో ఇద్దరు రేంజర్లు, మరో ఇద్దరు డిప్యూటీ రేంజర్లు, వాచర్ గార్డ్స్ ప్రమేయం ప్రత్యక్షంగా వుండగా, అటవీశాఖ ఉన్నతాధికారులు వీరికి సహకరిస్తున్నట్లు తెలిసింది. జిల్లాలోని వన సంరక్షణ సమితుల పనితీరుపై సమగ్ర దర్యాప్తు చేయిస్తే కావాల్సినన్ని అవినీతి చరిత్రలు బయటపడే అవకాశం వుంది.

## ప్రాణం పోయినాసరే అవినీతి పాల్పడను

తన బొందిలో ప్రాణమున్నంత

## జిల్లావార్తలు

వరకు అవినీతికి పాల్పడనని కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి ప్రజలకు వాగ్దానం చేశారు. 2తేదీ జిల్లాలోని ఎమ్మెల్యేలలో వేణుగోపాలరెడ్డి ప్రయోగాత్మకంగామొదలెట్టిన 'డయల్ యువర్ ఎమ్మెల్యే' కార్యక్రమంలో ఫోనులో ప్రజలడిగిన పలు ప్రశ్నలకు సమాధానం చెప్పారాయన. 40 నిమిషాల పాటు ఈ కార్యక్రమం కొనసాగింది. టౌన్‌లో జరిగిన ఇళ్ల పట్టాల కుంభకోణంలో తమకు ప్రమేయం వున్నట్లుందని ఒక పౌరుడు ఫోన్‌లో ప్రశ్నించగా వేణుగోపాలరెడ్డి పై విధంగా వ్యాఖ్యానించారు. ఎక్కువ మంది ప్రజలు పట్టణంలో పేరుకపోయిన చెత్త, శుభ్రపరచని మురుగు కాల్వలు, నీళ్లురాని కొళాయిల గుర్చి ఎమ్మెల్యేనడిగారు. దీంతో ప్రతివీధిలో ఒక చెత్తకుండి, కొన్ని రిక్షా బండ్లు, ఒక ట్రాక్టరు ఈ చెత్త చెదారాన్ని ఎత్తేందుకు తాను స్వయంగా కొనుగోలుచేసి మునిసిపాలిటీకి ఇవ్వనున్నట్లు చెప్పారు. కావలి చెరువు క్రింద పంట లెండకుండా సాధ్యమైనన్ని చర్యలు తీసుకొంటానన్నారు. మునిసిపాలిటీ విద్యుత్ శాఖకు 92లక్షల రూపాయలు బాకీ పడడం వల్లే, వీధి దీపాలు పలుచోట్ల వెల్గడం లేదని ఈ సమస్యను ఏదో ఒక రకంగా పరిష్కరిస్తానన్నారు. దోమల బాధ తప్పించను ఫాగింగ్ మిషన్‌ను మునిసిపాలిటీ చేత కొనిపించనున్నట్లు చెప్పారు. బైపాసు రోడ్డుకంటే ముందుగా కావలిలో నాలుగు లైన్ల రోడ్డు వేయిస్తానన్నారు. మునిసిపల్ వైస్ ఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టి కావలిలో అరాచకాలు చేస్తున్నట్లు ఒక వ్యక్తి ఎమ్మెల్యే దృష్టికి తీసుకరాగా, ఈ సమస్యపై వ్యక్తిగతంగా తనను కలిస్తే బాగుంటుందన్నారు.

## తీరప్రాంతాల్లోని వారికి పక్కా గృహాలు!

జిల్లాలోని సముద్రతీర ప్రాంతంలో నివసిస్తున్న మత్స్యకారులకు దశలవారీగా పక్కా గృహాలు కట్టిస్తామని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి హామీ ఇచ్చారు. 11

తొరవ 8వ పేజీలో

# నెల్లూరు గుసగుసలు

## ఆదాలపై సోమిరెడ్డిగుర్రు

ఇరిగేషన్ మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మీద మాజీ అమాత్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి మాంచి గుర్రుమీద వున్నారు. సందు దొరికితే, ఇరుకున పెట్టాలని ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. జడ్పీ సమావేశంలో, సమావేశం చట్టబద్ధతపై ఎమ్మెల్యే బ్రదర్స్ లేవనెత్తిన అభ్యంతరాలకు, సమాధానం చెప్పాల్సి వచ్చె. సోమిరెడ్డి తెలివిగా మంత్రిని ఇబ్బందుల్లోకి నెట్టాలని ప్రయత్నించారు. మాజీ రాష్ట్రపతి శంకర్ దయాళ్‌శర్మ మృతికి సంతాపం తెలిపిన తర్వాత సభ వాయిదా పడుతుందని మొదట పంపిన ఎజెండాలో పేర్కొన్నారట. అందువల్ల సంతాప తీర్మానం తర్వాత సభ వాయిదా వేస్తున్నారా అంటూ ఎమ్మెల్యే బ్రదర్స్ సిగిరేను విలరీశారు. ఒకవేళ సభ జరిగినా, దీనికి చట్టబద్ధత వుంటుందా అంటూ ధర్మ సందేహం లేవనెత్తారు. దీంతో సోమిరెడ్డి లేచి, శర్మ మృతికి ఏడు రోజుల పాటు సంతాప దినాలు పాటించాలని ప్రభుత్వం ఆదేశాలు ఇచ్చిందని పేర్కొన్నారు. వాస్తవంలో అయితే సంతాప దినాల్లో అధికారికంగా మంత్రులు ఎటువంటి కార్యక్రమాలు చేపట్టకూడదని. దానికి విరుద్ధంగా మంత్రి ఆదాల చాలా పనులకు శ్రీకారం చుట్టారని సభలో వివరించారు. ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలు, కొత్త పథకాలకు శ్రీకారం చుట్టంగా లేంది జడ్పీ సమావేశాన్ని కొనసాగిస్తే తప్పేమిటని తెలివిగా ఎత్తి పొడిచారు. ఈ సమావేశంలో మొట్ట మొదటిసారిగా జడ్పీ ఛైర్‌పర్సన్ కౌసల్య మూగనోము వీడి, మూడు సెకన్లలో ఆరు మాటలు మాట్లాడింది. అవి ఆమెకు తప్ప ఎవరికీ అర్థం కాలేదు. అర్థం చేసుకోవాలని కూడా ఎవరూ ప్రయత్నించలేదు.

## కలెక్టరమ్మపై కస్సుమన్న కౌన్సిలర్లు

నెల్లూరులో ప్రతిష్టాకరంగా రూపుదిద్దుకుంటున్న చిన్న పిల్లల పార్కుకు ఎసి. సుబ్బారెడ్డి పేరు పెట్టడంపై జిల్లా కలెక్టర్ అభ్యంతరంపై, కాంగ్రెస్ కౌన్సిలర్లు కస్సుమంటూ లేచారు. చాట్లనరసింహారావు, సందానీబాషా, రాఘవరెడ్డి, పిండి సురేష్, భానుశ్రీ తదితర కౌన్సిలర్లంతా గురువారం నాడు విలేఖరుల సమావేశం ఏర్పాటుచేసి ఎసి. గురించి ఓనమాలు కూడా తెలియని కలెక్టర్ పిల్లల పార్కుకు ఆయన పేరుకు మోకాలడ్డటం ఏం న్యాయమని ప్రశ్నించారు. ఎసి. పిల్లల పార్కుగా నామకరణంపై కౌన్సిల్ తీర్మానానికి ఏ ఒక్కరూ అభ్యంతరం చెప్పకపోయినా కలెక్టర్ ఎందుకు ఈ విషయంలో వేలు పెట్టిందో అర్థం కావడం లేదు. బహుశా, రాజకీయ ప్రచ్ఛన్న హస్తం ఏదో ఆమెను బలవంతం చేసి నట్టుంది. ఏవరైతేనేం, ఏదైతేనేం ఇప్పుడు వివాదాస్పదురాలైంది కలెక్టర్! వివరణ ఇచ్చుకోవాల్సింది కలెక్టరే. టౌన్‌లో అనేకమంది వీధిరౌడీలు, జేబుదొంగలు, హంతకులు అవినీతి రాజకీయనేతల పేర్లతో కాలనీలు వెలిస్తే నిమ్మకునీరెత్తినట్లు నగిచ్చినట్లు వ్యవహరించి, పార్కుకు ఎసి. పేరు పెడితేనే కొంప కొల్లేరు అవుతుందని చెప్పడం న్యాయమా? శాంతి భద్రతల సమస్య తలెత్తు తుందనడం సమంజసమా? ఉన్న గొడవలు చాలక ఈ కొత్త వివాదం ఎందుకండీ, కలెక్టర్‌గారూ?

## బావసయ్యా బావమరిది సయ్యా

బావ, బావమరుదులు సోమిరెడ్డి, నల్లపరెడ్డి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది. మాజీ మంత్రులుగా మిగిలిన వారిద్దరూ ఒకరొకరు సాధించుకోవడంలో తలమునకలై పోయారు. చంద్రమోహన్‌రెడ్డి ఇప్పుడు కాంట్రాక్టర్‌గా కొత్త అవతారం ఎత్తాడని ప్రసన్న కనపడ్డవాళ్లందరికీ చెబుతున్నాడు. ఒక కోటి 80లక్షల రూపాయల డ్రెయిన్‌ల పనులు అధిక ఎస్టిమేషన్‌లతో బినామీ పేర్లతో కొట్టాడని ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశాడట. ఈ వ్యవహారంలో పత్రికల వార్తలను, ముఖ్యమంత్రి కార్యాలయానికి ఫ్యాక్స్ చేశాడు. సోమిరెడ్డిని రాజకీయంగా తుడిచిపెట్టే వరకు నిద్రపోనని చెబుతున్నాడట. మంత్రి పదవి ఊడిన తర్వాత, ఖాళీగా ఉండడమెందుకని, నాలుగు రూకలు సంపాదించుకుందామని కాంట్రాక్టుల్లో దిగితే తనను ఇంకా యాతన పెట్టడమెందుకని చంద్రమోహన్ కుమిలి పోతున్నాడు.

జన్మభూమి పేరుతో, కాలువల రిపేర్ల సాకుతో, చివరకు వైద్య సహాయం కింద ముఖ్యమంత్రి సహాయనిధిని అడ్డంపెట్టుకొని కోట్లు దోచేసినా ప్రసన్న విషయం తాను ఏనాడూ బయట చెప్పలేదని తన మీద ఇంకా కసిఎందుకని బాధపడుతున్నాడట పాపం! బావ, బావమరుదులిద్దరూ ఒకరు ఈకలు ఒకరు పీక్కొని రాజకీయంగా దిసమొలలతో మిగిలిపోయారు. సయోధ్య ఇక అసాధ్యమన్న స్థితికి ఇద్దరి మధ్య వివాదం చేరుకుంది. రానున్నకాలంలో బావ, బావమరుదుల సంగ్రామం మరింత రక్తి కట్టనుంది. వేచి చూద్దాం!

## మున్సిపాలిటీలో అలబరి సంసారం

మొగుడు పెళ్లాల మాదిరి ఉండాల్సిన నెల్లూరు మున్సిపల్ చెర్మన్ దశయ్య, కమీషనర్ వేమారెడ్డి మధ్య సంబంధాలు పూర్తిగా చెడిన పోయాయి. దీంతో, మున్సిపల్ పరిపాలన అలబరి సంసారం మాదిరి తయారయ్యింది. ఒకరు ఎడ్డెం అంటే రెండోవారు తెడ్డెం అంటున్నారు వీరిద్దరి మధ్య కొంత మంది కౌన్సిలర్లు పొయ్యిరాజేసి తమకు చేతనైన రీతిలో పనులు, టెండర్ల పేరుతో నిధులు దోచేస్తున్నారు.

కౌన్సిల్‌కు రేపో, మాపో గడువు ముగిసిపోనుంది. మున్సిపాలిటీ ఖాతాలో డబ్బులు ఉన్నాలేకున్నా, పనులు ఆమోదింపజేసి టెండర్లు చేజిక్కించుకుంటే తర్వాత సంగతి అన్నట్టు వ్యవహరిస్తున్నారు. విజిలెన్స్ అధికారులు కూడా ఇటీవల మునిసిపాలిటీ ఇంజనీరింగ్ శాఖలో రికార్డులు తనిఖీ చేసి, మున్సిపాలిటీలో అక్రమాలు, ఆదుర్దా టెండర్లపై ప్రభుత్వానికి నివేదిక పంపారట. అయినా కౌన్సిలర్లు మాత్రం రద్దు చేసిన మూడు కోట్ల రూపాయల పనులు మళ్లీ పెట్టమని వత్తిడి చేస్తున్నారట. కమీషనర్ మాత్రం ససేమిరా అంటున్నాడు. ఏం జరుగుతుందో చూడాలి!

## ఛైర్మన్ పదవి కోసం ఎదురు చూపులు

నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్ పదవి కోసం చాలా మంది బాసికాలు కట్టుకొని రెడీగా ఉన్నారు. జనరల్ సీటో, రిజర్వ్‌డో తెలియక ఒకవేళ రిజర్వ్ అయినా ఏ వర్గానికి కేటాయిస్తారో తెలియక నరాలు తెగే టెన్షన్‌తో సతమతమై పోతున్నారు. మున్సిపాలిటీలో జనరల్ అయితే కాంగ్రెస్ తరఫున ఎమ్మెల్యే వివేకా ముగ్గురికి బాసికాలు కట్టి, కళ్యాణ తిలకం దిద్ది రెడీగా వుంచాడు. సీనియర్ కౌన్సిలర్లు కెవి. రాఘవరెడ్డి, చాట్ల నరసింహారావు, సందానీబాష ఆయన మదిలో ఉన్నారని చెబుతున్నారు. 99పాళ్లు నెల్లూరు మున్సిపల్ జనరల్ సీటు కాదన్న విషయం ఖాయమై పోయింది. అందువల్ల వాళ్ల ఆశ నిరాశ కానున్నది. బిసి. అయితే చాట్ల నరసింహారావు పేరు పరిశీలనలో ఉందన్నప్పటికీ, గాజుల బలిజ కులాన్ని బీ.సి.లో చేరుస్తూ జి.ఓ. రాకపోవడం వల్ల ఒకవేళ బిసి అయితే, మరొకరి పేరు ఆలోచించాల్సిన పరిస్థితి. మహిళలకు రిజర్వ్ అయితే, కాంగ్రెస్‌లో మహిళా కౌన్సిలర్లకు, నాయకురాళ్లకు కొరవేలేదు. ఇప్పటికప్పుడు అయితే ప్రచారంలో ఉన్నపేరు భానుశ్రీదే. ఎస్‌సి, ఎస్‌టిలకు కేటాయించినా అభ్యర్థులకు ఇబ్బంది లేదు. తెలుగుదేశం తరఫున జనరల్ సీటైతే అధిష్ఠానం సమ్మతిస్తే తానే అభ్యర్థినంటూ రమేష్‌రెడ్డి ముందు వరుసలోనే ఉన్నాడు. మహిళలకైతే రమేష్ ఇంట్లో వాళ్లే అభ్యర్థులుగా పోటీలో ఉంటారు. రమేష్ వ్యతిరేక వర్గంలో మాత్రం జనరల్ సీటైతే అభ్యర్థి ఎవరన్న విషయంలో వివాదాలు తలెత్తె అవకాశం వుందిగానీ, బిసి. అయినా, మహిళా సీటయినా, దశయ్య, లక్ష్మీకుమారి పేర్లే ప్రముఖంగా వినిపించబోతాయి. 11వ తేది నాటికి ఏ సంగతి తెలిపోతుంది. అంతవరకు ఛైర్మన్ గిరి కోసం కలలుకనే వాళ్లను వద్దనడం న్యాయం కాదు కదా?

## సిపిఎం నేతల హత్యకు కుట్ర?

బిజెపి మాజీ పట్టణాధ్యక్షుడు సిహెచ్. రామకృష్ణారెడ్డి హత్యకు కారకులైన సిపిఎం నేతలను హతమార్చాలని పథకం పన్ని వున్నట్లు తెలిసింది. ఇదే సమాచారం పోలీసులకు, సిపిఎం నేతలకు సైతం అందిందట. దీంతో సిపిఎం జిల్లా కార్యదర్శి జక్కా వెంకయ్య, ఎస్పీ సివి. నరసయ్యను కలిసి ఈ విషయం నివేదించారట. ఈ హత్యకేసులో నిందితులైన నాయకులంతా వంటరిగా తిరగవద్దని సిపిఎం పార్టీ హుకుం జారీచేసిందట. గత ఏడాది జనవరి 24తేది రామకృష్ణారెడ్డిని, సిపిఎం పార్టీకి చెందిన వారు హతమార్చారని పోలీసులు కేసు నమోదు చేసివున్నారు. బిజెపి జిల్లా నాయకులు హత్యా రాజకీయాలు వద్దంటున్న, పార్టీలోని ఒక అతివాద వర్గం హైదరాబాద్‌లో ఈ హత్యా పథక రచన చేసినట్లు వినికిడి. హత్యా రాజకీయాలు ప్రతీకార హత్యలు జిల్లాలో తక్కువ. ఈ వ్యవహారంలో పోలీసులు అప్రమత్తంగా వ్యవహరించి ఎటువంటి ఉపద్రవం రాకుండా చూడాల్సి వుంది.

## నాటకోత్సవం ప్రారంభం

అప్పాజోస్యుల - విష్ణుభొట్ల ఫౌండేషన్ ఆఫ్ అమెరికా, సింహపురి కల్చరల్ అసోసియేషన్ సంయుక్తంగా నిర్వహిస్తున్న నాటకోత్సవాలు 6తేది టౌన్‌హాల్‌లో ఘనంగా ప్రారంభమయ్యాయి. వీటి ప్రారంభానికి ముందు గాంధీ బొమ్మ నుంచి టౌన్‌హాల్ వరకు వందలాది మంది కళాకారులు 'నాటకం కోసం నడక'ను నిర్వహించారు. టౌన్‌హాల్‌లోనే ప్రఖ్యాత చిత్రకారుడు ఉల్పి చిత్రకళా ప్రదర్శనకు అప్పాజోస్యుల సత్యనారాయణ రిబ్బన్ కటింగ్ చేశారు. పోటీ నాటికల ప్రారంభ సభకు నాటక రచయిత పులుగొండ్ల రామకృష్ణయ్య జ్యోతి ప్రజ్వలన చేశారు. పొన్నాల రామసుబ్బారెడ్డి, కొండా బలరామిరెడ్డి తదితరులు పాల్గొన్నారు. అనంతరం పాలకొల్లు క్రియేటర్స్ ప్రదర్శించిన నాలుక్కాళ్లమనిషి, వర్ధమాన సంగం వైర్ క్రియేషన్స్ వారి రామణాకాష్టం, బాపట్ల స్నేహసమాఖ్య వారి పాలెగాళ్లు నాటికలు ప్రజలను చక్కగా అలరించాయి. 9తేది వరకు నాటకోత్సవాలు కొనసాగుతాయి. అదే రోజు నెల్లూరీయుడు, వచనకవితా పిత నెరోరుడు తక్కెళ్లపల్లి పట్టాభిరామరెడ్డి (పట్టాభి)ని సత్కరిస్తారు. నెల్లూరీయులందరూ ఈనెల 9వరకు పాల్గొన్నవలసినది నాటకోత్సవం నాడు.

## జిల్లా అంతటా మంత్రి పర్యటన

21తేది నుంచి నెల్లూరులోనే మకాం వేసివున్న ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి 3తేదీ ప్రారంభమైన జన్మభూమి కార్యక్రమాన్ని పురస్కరించుకొని జిల్లా అంతటా పర్యటిస్తున్నారు. 5తేది రాపూరు, 6తేది ఆత్మకూరు, 7తేది కావలి నియోజక వర్గాల్లో పర్యటించారాయన. 8తేది ఉదయగిరి, 9తేది గూడూరు, 10తేది కోవూరు, 11తేది నెల్లూరు నియోజకవర్గాల్లో జరిగే జన్మభూమి కార్యక్రమాలలో పాల్గొని 12తేది హైదరాబాద్‌కు రైలెక్కుతారు.

## ఆలస్యంగా ప్రకటించిన కరెంట్ కోత

నెలకుపైగా అనధికారికంగా విద్యుత్ కోత విధిస్తున్న అధికారులు, ఈ కోతను

కొరవ 7వ పేజీలో

# నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

3వతేదీ నుంచి అమలు చేస్తున్నట్లు ప్రజలు ఆశ్చర్యపోయే ప్రకటన చేశారు. ట్రాన్స్‌కో సూపరింటెండెంట్ ఇంజనీర్ (ఆపరేషన్స్) ఎం. ప్రభాకరరెడ్డి ప్రకటన ప్రకారం నెల్లూరుటౌన్‌లో సాయంత్రం 4 గంటల నుంచి 6 గంటల వరకు అధికారికంగా విద్యుత్ కోత విధిస్తారు. జిల్లా అంతటా ఈ కోత వేళలు వేరుగా ఉంటాయి.

## మోహనరావుకు డాక్టరేట్

అనుమసముద్రంపేట శ్రీకొలను గ్రామానికి చెందిన ఎల్. మోహన్‌రావుకు ఎస్వీ యూనివర్శిటీ డాక్టరేట్ ప్రదానం చేసింది. 'భారతదేశ విదేశాంగ విధానం - సార్క్ దేశాలతో భారత్‌సంబంధాలు' అనే అంశంపై ప్రొఫెసర్ ఎస్.హెచ్. సీతారామశర్మ గారి పర్యవేక్షణలో మోహనరావు ఈ పరిశోధనలు చేశారు.

## అజ్ఞాత వాసం వీడిన బిజెపి నేతలు

గతకొన్ని సంవత్సరాలుగా బిజెపి అగ్ర, స్థానిక నేతల వైఖరికి విసిగి వేసారి అజ్ఞాత వాసంలోకి వెళ్లిన పార్టీలోని అతి వాదులు కర్నాటి ఆంజనేయరెడ్డి, కరణం భాస్కర్, ఆమంచర్ల శంకరనారాయణ తిరిగి స్వంత గూటికి తిరిగొచ్చారు. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో నెల్లూరు స్థానం నుంచి బిజెపి అభ్యర్థిగా పోటీ చేసిన డేగా నారసింహారెడ్డి వైపు అవిశ్రాంత ప్రచారం చేయడంతో ఈ నేతలు తిరిగి గుర్తింపులోనికి వచ్చారు. రెండు వారాల క్రితం నెల్లూరు వచ్చిన అగ్రనేత వెంకయ్యనాయుడు వీరు తిరిగి పార్టీలో చేరేందుకు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడంతో జిల్లా పార్టీ అధ్యక్షుడు సురేష్‌రెడ్డి వీరిని చేతులు చాచి ఆహ్వానించక తప్పలేదు. ఈ ముగ్గురు నాయకుల చేరిక పార్టీలో ముసలానికి దారితీస్తుందో, పార్టీ బలపడేందుకు ఉపయోగపడుతుందో కొన్నాళ్ల వేచి చూస్తేగాని తెలదు.

## జడ్పీఛైర్మన్ కారు దుర్వినియోగం

జిప ఛైర్మన్ శ్రీమతి నెల్లూరు కౌసల్య కారును గతంలో ఏ ఛైర్మన్ కారు వాడనట్లుగా ప్రైవేటు కార్యకలాపాలకు వాడుతున్నారు. ఆమె భర్త, అటెండర్, బంధువులు ఈ కారును ఇష్టమొచ్చిన చోటకు వేసుకుని వెళ్తుంటారు. ఇటీవల ఈ కారును వేసుకొని వెళ్లిన జడ్పీ ఛైర్మన్ భర్త ప్రమాదవశాత్తు గాయపడడంతోపాటు, కారు పూర్తిగా ధ్వంసమయ్యింది. గత ఏడాదే కొన్న ఈ కారు ఆటోనగర్‌కి వెళ్లి భారీగా జడ్పీనిధులు డ్రా చేయించి బాగయ్యింది. అదేం ఖర్మోగాని జిప ఛైర్మన్ కుర్చీలో ఎవరు కూర్చున్నా అధికారాలను, సౌకర్యాలను దుర్వినియోగ పరుస్తున్నారు.

## రంగారెడ్డికి డాక్టరేట్

నెల్లూరీయుడు, ప్రస్తుతం సింగరాయ కొండ ఇంజనీరింగ్ కళాశాల పనిచేస్తున్న కేసంరెడ్డి రంగారెడ్డికి తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ డిగ్రీ ప్రదానం చేసింది. 'జీవరసాయనిక చర్యల పరివర్తన మూలకాల కీలెట్‌ల చర్యా స్థిరాంకాలను కనుగొని పరిశోధనా పత్రాన్ని సమర్పించినందుకు ఈ డిగ్రీ ఇచ్చారు. రంగారెడ్డి ఎపి సర్వీస్ కమీషన్ ఛైర్మన్ డాక్టర్ ఆర్. రాఘవనాయుడు పర్యవేక్షణలో ఈ పరిశోధన చేశారు. యూనివర్శిటీలో అకడమిక్, ఫైన్ ఆర్ట్స్ రంగాల్లో ఎన్నో పతకాలు పొందిన రంగారెడ్డి కువైట్ విశ్వవిద్యాలయం ఆహ్వానం మేరకు పరిశోధన నిమిత్తం ఆ దేశానికి పయనమవుతున్నారు.

## మరణం

నెల్లూరు కాంట్రాక్టర్లలో తనేదో, తన పనేదో చూసుకొంటూ పబ్లిక్‌లో లేని సౌమ్యుడు జక్కా గోపాలరెడ్డికి పుత్రవియోగం జరిగింది. బెంగుళూరులో వుంటుండిన గోపాలరెడ్డి కుమారుడు శ్రీధరరెడ్డి 47ఏట, స్వల్ప అస్వస్థతతో 23తేదీ స్వర్గస్థుడైనాడు. ఆయనకు భార్య, ఇద్దరు కుమారులు. గోపాలరెడ్డి కుటుంబానికి మా సానుభూతి.

## అబ్బాయిరెడ్డి సోదరి మరణం

పాతరోజుల్లో ప్రయాణీకులను టంచన్‌గా టైముకు గమ్యం చేరుస్తుండిన నెల్లూరు - చిత్తూరు సిఎంటి బస్సు ఓనర్ చీరాల వాస్తవ్యులు లక్ష్మిరెడ్డి భార్య, లెఫ్ట్ భావాల వకీలు అబ్బాయిరెడ్డి అక్క పులకం సరోజనమ్మ 6తేదీ మద్రాసు అపోలో ఆస్పత్రిలో చనిపోయింది. తల్లిని మరపించిన అక్కను కోల్పోయిన అబ్బాయిరెడ్డికి మా సానుభూతి.

## దొంగలు

మొదటి పేజీ తరువాయి

పడుతున్నదీ అర్థం చేసుకోవచ్చు.

తరచి చూస్తే ఇట్లా ప్రతి పథకంలోనూ ప్రభుత్వ నిధులు గాలికి పోయే పేలపిండి రామార్పణం అన్న తరహాలో స్వాహా అయిపోతున్నట్లు రుజువౌతున్నది. ఏమిటీ విచ్చలవిడి? ఏమిటీ పట్టపగలు దోపిడీ? ప్రభుత్వ పథకాలను అవినీతిపరులు ఇట్లా పటిక బెల్లం వలె ఆరగించగలగడానికి కారణమేమిటి? ఎక్కడుందీ లోపం? దీనికి నిష్కృతి ఎట్లా? ఎవరు పూనుకోవాలి?

కలెక్టర్ శ్రీమతి వై.శ్రీలక్ష్మి గతంలో ఎక్కడ పని చేసినా నిప్పువంటి నిజాయితీ పరురాలనే పేరు తెచ్చుకొన్నారు. గూడూరు సబ్ కలెక్టర్‌గా ఆమె కొరకరాని కొయ్య అని పేరు పడ్డారు. విశాఖపట్నం మునిసిపల్ కమీషనర్‌గా పనిచేసిన సమయంలో ఆమెకు రాష్ట్ర వ్యాప్త ఖ్యాతి లభించింది. అవినీతి పరులైన అధికార్లతో, రాజకీయ వాదులతో యుద్ధం చేశారామె. నెల్లూరు కలెక్టర్‌గా వచ్చిన తర్వాత కూడా ఆత్మకూరు మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు బిన్నభూమిల దోపిడీకి ప్రయత్నిస్తే ఎంతటి వత్తిడి తట్టుకొని ప్రతిఘటించారు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మంత్రిగా వున్నప్పుడు ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించారు. అంతటి చరిత్ర కలిగిన కలెక్టర్ వుండీ జిల్లాలో ఈ పరిస్థితి ఏర్పడడం బాధాకరం. తన వ్యవహారశైలిలో, క్రింది అధికారులను నమ్మి బాధ్యతలు అప్ప చెప్పడంలో ఏదో లోపం వుండ బట్టే పరిస్థితి ఇంతగా అదుపు తప్పిందని గ్రహించి, ఆ లోపాన్ని సరిదిద్దుకోవడం కలెక్టర్‌గారి బాధ్యత.

# రాయి-తురాయి

## * వచన కవితా చక్రవర్తి - తిక్కవరపు పఠాభి !

తానే నిర్మాత, దర్శకుడుగా 'సంస్కార్' సినిమా తీశారు; తన అర్ధాంగి స్నేహలతనే నటిగా ఎన్నుకున్నాడు. అంతర్జాతీయ స్థాయిలో అవార్డులందుకొని వినుతికెక్కారు; సత్యజిత్‌రే అంతటి మహోన్నత దర్శకుడు 'సంస్కార్'ను మెచ్చుకొన్నారంటే ఇక ఇతరుల కితాబుకు లెక్కేముంది? ఇది దర్శకుడుగా తిక్కవరపు పట్టాభిరామిరెడ్డి నెత్తిన నెలకొన్న కీర్తికిరీటం.

దీనికి కొన్ని దశాబ్దాల ముందే పట్టాభిరామిరెడ్డి కవి 'పఠాభి'గా రూపాంతర సిద్ధి (Metamorphose) పొందారు. పట్టాభిరామిరెడ్డి అనే తన పేరులోని రెండవ అక్షరమైన ద్విరుక్త 'ట' కారాన్ని నొక్కేసి, అదే వర్గంలోని ద్వితీయ అక్షరాన్ని, తొలగించిన దాని స్థానంలో తగిలించి, తన కవిత్వం వింతగా, కొత్తగా ఉంటుందని తన పేరులోనే సూచించారు.

'పఠాభి'లో మూడవ అక్షరం 'భి'కి 'భీ'అని పొల్లు లేకపోయినా, 'ఫిడేల్ రాగాలడజన్' ఫిడేల్ ఫిడేల్ మని మ్రోగి, నాటి కవిపండితలోకపు గుండెల్లో దడ రేపింది. బిత్తర పోయిన కవులూ, విమర్శకులూ తత్తరపాటుతో మాటల ఈటెలతో తలా ఒక పోటు పొడిచారు.

ఉక్తిలో వైచిత్రిని చూపటమొక్కటే

అగ్నిమిత్ర

కారణంకాదు; వైచిత్రీ ప్రయత్నాన్ని మన ప్రాచీన కవులలోనూ చూడగలం. కాని పఠాభి చూపిన వైచిత్రి మరీ చిత్రమైంది. పఠాభి గడుగ్గాయి. తనం అంతటితో ఆగిపోలేదు. చిన్నయ సూరికి చిన్న ముద్రాతు; తన "వచన పద్యాలనే దుడ్డుగ్రలతో పద్యాల నడుముల్ని విరగదన్ని" అప్పకవి గొప్పతనానికి ఎసరు పెట్టాడు. బాగా నాటుకొనిపోయి, నేటుకొని ఉన్న సాహిత్య సంప్రదాయాలనూ, కవి సమయాలను కాలదన్నాడు. కామోన్మాదంలో కామినులతో కూడిమాడాడు; కావిపనులకు ఒడిగట్టాడు.

ఇన్ని 'పాపాలు' మూటగట్టుకొన్న పఠాభి వ్రాతలు 'అకవితలు' పొమ్మన్నారు, కాని ఇంత మందీ పెట్టిన శాపాలే పఠాభికి అడగని వరాలయ్యాయి. 'పఠాభి' వచన కవితకు పునాదులు వేర్పాడు. ఆరుద్రకు ఉప్పు అందించాడు; పఠాభి 'హైహీలు యానలు' అంటే ఆరుద్ర 'గూడ్సు గమనలు' అన్నాడు. పఠాభి అంత్యప్రాసలే ఆరుద్రకు అన్న ప్రాశన. ఇది తెలియని వాళ్లు ఆరుద్రను అంత్యప్రాసల ఆజాదుగా గుర్తించి కీర్తించారు.

'కామక్షికోక', 'నవ్యష్టి' ఇత్యాది కవితల్ని చూచి కావచ్చు - 'మలిన శృంగారం' అంటూ మూతి విరిచారు కొందరు; పై కైతలు సిగ్మండ్ ఫ్రాయిడ్ లిబిడో (Sex) సిద్ధాంతానికి కవిత్వపరమైన వ్యక్తీకరణాలు. మనిషి అంతశ్చేతనా సాగరంలో అణిగిమణిగి ఉండే భావాలను పఠాభి దేవి బయట పడేశాడు. అంతరంగపు అగాధాల్లో దాగుడు మూతలాడే దొంగల్ని దొరక బుచ్చుకొన్నాడు; దొంగాటకం మాన్పించి రంగంపైకి తెచ్చి నిలిపాడు. ఇది 'మలిన శృంగారం' అయితే, శ్రీనాథ, పెద్దన తిమ్మనాదులది మలిన శృంగారం ఎట్లా కాకుండా పోతుంది? అయినా ఈ మలిన శృంగారాన్ని మేలుపూతగా కాకపోయినా, పునః పునఃలాయంలో ముదగదీసుకో నివ్వని పుణ్యాత్ముడెవ్వరు? ఇది నేను వేస్తున్న ప్రశ్నకాదు - ఫ్రాయిడ్ అడుగుతున్న సంప్రశ్న. కావ్యంలో తటస్థమయ్యే పఠాభి మనుషులందరికి ప్రతినిధి. కాదన్నవారితో వాదం వ్యర్థం.

'శ్రోణీ సైకతశ్రేణి' అంటే ఒప్పు; 'మీటిన విచ్చు గుబ్బ చనుమిట్టలు' అంటే ఆహా, పెద్దన వరూధిని వక్షస్సౌందర్యాన్ని ఎంత బాగా కళ్లకు కట్టాడు అని మెప్పు; కానీ, 'శ్రోణీ వక్షః పీఠభూములు' అన్న పఠాభి ముమ్మాటికి అకవి; మొదటివి పెద్దరికం ఉన్నవాళ్ల ఒజ్జతనపు తళుకులు; పఠాభివి కుర్రతనపుముద్రు ఓడుతున్న పస దప్పిన పలుకులూ, ఆ కవిత్వపు చెణుకులూ, అని మనం అనుకోవాలన్నమాట. తీరుదప్పిన తీర్పరితనంలో ఎంత తెంపరితనముందీ!

'నవ్యష్టి' పాణి ద్వయాన్ని వర్ణిస్తూ పఠాభి - "ఆల్ జీబ్రా గణిత శాస్త్రంలోని మహా సూత్రమును, కుండలీకరించియున్న బిగ్ బ్రాకెట్ల వలె ఉన్నాయి", అనే గడుసుదనపు అభివ్యక్తి కూడా అకవిత్వమేనా? ఈ కొంగ్రొత్త అభివ్యక్తిలో ప్రతిఫలిస్తున్న భావ చిత్రాన్ని చూడలేని కళ్లోయిలో ఏదో దోసమున్నట్లె లెక్క. పఠితలను హాస్యరస సేచనంతో అలరిస్తూనే, 'మహాసూత్రం'అనే మాటలో, ఆ తరుణి బాహుద్వయమధ్యగతగాత్రసంగిత కవ, కుచ, జఘన, నాభీ, ఊరుః దేశాదికాలను ధ్వనింపజేసిన పఠాభిది విరుపదు కాదు; ఉరుప్రజ్ఞ. దీన్ని కూడా అకవిత్వమని రసజ్ఞులను వెయ్యిదండాలు.

'ఫిడేల్ రాగాల డజన్' ప్రధానంగా ఎక్కిరింత కావ్యం; పరిహాసమే ముఖ్యవస్తువైన ఈ కావ్యంలో గాంభీర్యం (Grandeur) లేదనడం ఏదో ఒక సొడ్డుపెట్టి నెట్టెయ్యాలను కోవడమే. కవి దృక్పథంలోంచి కావ్యాన్ని అనుశీలించ కుండా, తమ తమ చూపులను దాని మీద పరచి చెనటి కావ్యం అనడం ఉచితజ్ఞత కానేరదు.

'ఫిడేల్ రాగాల డజన్ను' తూర్పార బట్టిన విమర్శకుల్లో ఒక్కరు కూడా 'అహం భావ కవిని నేను' అనే పద పంక్తిలోని నిగూఢార్థాన్ని గ్రహించినట్లు లేదు. 'పొగరుబోతు' అనే దాని బాహ్యార్థంతోనే సరిపెట్టుకొన్నారు. అహం - భావం - నేను - నా - అనే స్వభావం; తనకు ముందున్న కవులు నడిచిన నలిగిన బాటలో తాను అడుగిడటం లేదనీ, తన బాటా, తన పాటా అంతా తన సొంతమేనని సాకూతం.

ఇదంతా వ్రాయడం వల్ల ఫిడేల్ రాగాలను చాలా గొప్ప కావ్యంగా కీర్తిస్తున్నానని తాత్పర్యం కాదు. కావ్యంగా దాని హద్దులూ, పద్దులూ దానికున్నాయి. ఆ బరిలో నిలబడి చేస్తున్నదే ఈ సమీక్ష. వినూత్న ప్రయోగానికి, విలసన్నూతనాభివ్యక్తికి ఆలంబనమై ఉన్న 'ఫిడేల్ రాగాల డజన్' సమాదరణీయమైన లసత్కావ్యమే. శబ్దసౌకుమార్యం, శయ్య, పాకం వంటి పడికట్టుపలుకుల్ని లెన్సగా సలగొట్టి పొడిచేసి ఊదిపారేసిన ఈ కావ్యంలో వాటికై వెతకులాట పనిలేని మంగలి పిల్లితల గొరగడం వంటిది. కాబట్టి పఠాభిని అకవి అనడం, 'రాగాలడజన్ను' అకవితగా ఉపదించడం సరికాదు.

పఠాభి ఛందః పరిజ్ఞానం లేనివాడు కాదు; దాని లోతుపాతు లెరిగినవాడే. ముందు చూపున్నవాడు కాబట్టి రానున్న కాలంలో వచనమే రాజ్యమేలగలదని గ్రహించి, తానే వచనపద్యానికి ఒక ఒరవడి పెట్టారు. "కయిత నాదయిత" కావ్యంలో త్రిశ్రగతిలో నడుస్తున్న ఆతని 'జాబిల్లి' అనే కవితను వాచవిగా చూపుతున్నాను. నింగిలోని నెలవంకకు పెడుతున్న వంకలు ఆయన ఉపజ్ఞకు ఉదాహరణలు.

అనవసరముగు అరసున్న
గుర్రపులాడము, గిల్లి
వెన్నిగోరులాగ సన్న
గిల్లి యున్నది జాబిల్లి.

ఇక ఆయన చమత్కార చతురతకు, శ్లేషిత శ్లేషోశేముషికి మరికొన్ని మచ్చులు-

సధవ - తలిరుబోడి
విధవ - తలబోడి
గణితము కన్నను నాకు
మణితము ఇష్టము.

మణితఃబ్దం మీద శ్లేష - కోకిలరుత, రతిసమయకంఠస్వరగతి, అని రెండర్థాలు.

"ప్రియురాలికోక ప్రియునితో ఏమన్నది?
నా మర్మాలన్నీ నీవి" అని.

'నీవి' సర్వనామంగా ఒక అర్థం, కోకముడి అని మరొక అర్థం. ఆ 'ముడి' ఏదో విధంగా పాఠకులే విప్పుకోవాలి; వయసు మళ్లిన వాణ్ణి; నా వల్లకాదు.

చిల్లాడు వారికి, కైస్తవులకు
ఏసు దయ ఉండాలి.

మినాష్ అనే చీట్లాటలో Ace (ఆసు) ముక్క దొరతనం తెలిసిందే.

"ఆశ్చర్యంగా రాస్తాడు ఆహ్ రుద్ర" సంస్కృతంలో ఆః అనే ఏకాక్షర శబ్దానికి ఆశ్చర్యమనే అర్థం - ఆః అనిపించే చర్య ఆరుద్ర అనే పేరులోనే ఆః ఉన్నదని చమత్కృతి.

చెప్పుకొంటూ పోతే చక్కిలిగింతలు పెట్టె ఇటువంటి తళుకులెన్నో. పఠాభి తరహా కవిత్వం పఠాభితోనే ముగిసి పోవడం ముదావహమని కొందరు విమర్శకులు మురిసిపొయ్యారు. కాని, ఈ అభిప్రాయం కూడా గ్రహపాటు వల్ల జరిగిన పొరపాటే. పఠాభి తరహా కవిత్వాన్ని ఆరుద్ర అనుసరించాడన్న సంగతిని అటుంచితే - తనకు "తాతా, తాతా" అనే మనవళ్లు పుడతారన్న పఠాభి ఆశ, అడియాస కాలేదు. నాటి నుంచి నేటి దాకా విరివిగా ప్రవర్తిల్లుతున్న వచనకవితకు పఠాభే ఆద్యబ్రహ్మ; నేటి వచన కవులందరూ పఠాభికి మనవళ్లే - వాళ్లు ఆయన్ను 'తాతా' అని పిల్చినా, పిలవక పోయినాసరే - •

## కాజా

5వ పేజీ తరువాయి

లేకుండా, సంబంధింత శాఖ అధికారులకు తెలియకుండా, ఎమ్మెల్యేకు చెప్పకుండా, గ్రామస్థాయి తెలుగు నేతలే విధి, విధానాలను నిర్దేశిస్తుంటే, అధికార్లకు డిగ్రీలెందుకు? హోదాలెందుకు? జీతాలెందుకు? 11 విడత జన్మభూమి తీరుచూస్తే భవిష్యత్తులో ప్రభుత్వ కార్యక్రమాలన్నింటికి పార్టీ రంగు పులిమే అవకాశం స్పష్టంగానే కనపడుతుంది. అవినీతి సంపాదనకు కక్కుర్తిపడి, వ్యక్తిత్వాన్ని అమ్ముకొనే అధికార గణం ఉన్నంతకాలం ఇటువంటి అపచారాలకు లోటు ఉండదు.

## జిల్లావార్తలు

5వ పేజీ తరువాయి

విడత జన్మభూమి కార్యక్రమం ప్రారంభాన్ని పురస్కరించుకొని అల్లూరు మండలం ఇస్కపల్లి గ్రామంలో మంత్రి వివిధ ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలు చేశారు. 30లక్షల రూపాయల విలువ చేసే మూడు సిమెంటు రోడ్లు, 4 పాఠశాలల అదనపు భవనాలు, మూడు ప్రహరీగోడలకు మంత్రి ప్రారంభోత్సవం చేసారు. రెండు సిమెంటు రోడ్లు, రెండు పాఠశాల భవనాలు, ఒక అంగన్‌వాడి భవనానికి, పక్కా గృహాల సముదాయానికి మంత్రి శంకుస్థాపన చేశారు. ఈ కార్యక్రమాలకు బీద మస్తాన్‌రావు, రవిచంద్రలు అంగరంగ వైభవంగా ఏర్పాట్లు చేశారు. ఇక్కడ ఏర్పాటు చేసిన సభలో మంత్రి మాట్లాడుతూ జన్మభూమి కార్యక్రమంలో రాష్ట్రంలో 1744 కోట్ల రూపాయలతో వివిధ పనులు మంజూరు కాగా, 1435 కోట్ల రూపాయల విలువైన పనులు పూర్తయ్యాయి. జిల్లాలో 107 కోట్ల రూపాయల పనులు చేపట్టగా 88కోట్ల రూపాయల విలువైన పనులు పూర్తయ్యాయన్నారు. 11 విడత జన్మభూమి కార్యక్రమంలో గ్రామాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని మైక్రోప్లానింగ్ రూపొందించేందుకు చర్యలు తీసుకొంటున్నాం. మన రాష్ట్రం అమలు చేస్తున్న వినూత్న పథకాలు ఇతర రాష్ట్రాలవారు ఆదర్శంగా తీసుకొంటున్నట్లు చెప్పారు.

జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి మాట్లాడుతూ జిల్లాలో జన్మభూమి కార్యక్రమం జిల్లాలో ఆదర్శవంతంగా జరుగుతున్నట్లు చెప్పారు. ఎమ్మెల్యే డాక్టర్ రాజేశ్వరమ్మ మాట్లాడుతూ ఇస్కపల్లి వద్ద బకింగ్‌హాం కెనాల్‌పై బ్రిడ్జి నిర్మించేందుకు ఎమ్మెల్యే నిధుల నుంచి 10 లక్షల రూపాయలు ఇస్తున్నట్లు చెప్పారు. పంచాయతీరాజ్ కమీషనర్ చల్లప్ప, కావలి ఆర్డీఓ లక్ష్మీకాంతం, గ్రామ సర్పంచ్ బీదమల్లిఖార్జునరావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# చిత్రం 'వి'చిత్రం



ఆరున్నర అడుగుల ఆజానుబాహుడైన ఏ.సి.తో, హిందూపురం మున్సిపల్ చైర్మన్ కట్టా వెంకటశేషయ్య శ్రేష్ఠి. 1937లో మద్రాసులో జరిగిన రాష్ట్ర మున్సిపల్ ఛాంబర్ సదస్సులో తీసిన ఈ ఫోటో మానవుల నిమ్నోన్నతాలకు మచ్చుతునక.

## కంచె

5వ పేజీ తరువాయి

ప్రాంతాలకు నడుపుతున్న బస్సులు సరైన కండీషన్‌లో లేకపోవడం వల్ల ప్రజలు ఇక్కట్లు పడుతున్నారు. ఇక్కడి డిపో ఆదాయంలో నడుస్తున్నా, 1983లో జాతీయకరణ చేసిన సమయంలో కొత్తగా వేసిన బస్సులనే నేటికీ నడుపుతున్నారు. ఆత్మకూరు, ఇతర ప్రాంతాలకు వెళ్లు ఈ బస్సు లెక్కితే ఎప్పటికి గమ్యం చేరుతామో తెలియని పరిస్థితి. ఊడిపోయిన తలుపు, అద్దాలులేని కిటికీలు, కుషన్‌లేని చిలుము పట్టిన సీట్లు ప్రజలను చీకాకు పెడుతున్నాయి. మార్గ మధ్యమంలో ఈ బస్సులు ఆగిపోతుండడంతో వీటిని నెట్టను ప్రయాణికులకు దేవుడు గుర్తుకు వస్తున్నాడు. బస్సుల నిచ్చెనలన్నీ దెబ్బతిని వుండడం వల్ల లగేజి ఎక్కడవేయాలో గ్రామీణులకు అర్థం కావడం లేదు. చాలినన్ని బస్సులు లేక పోవడం వల్ల మరో గత్యంతరం లేక ఈ డొక్కు బస్సుల్లో ప్రజలు ఎక్కాల్సి వస్తుంది. ప్రజాసేవయే తమ ముఖ్యకర్తవ్యమని చెప్పే అధికారులు ఆత్మకూరు డిపోలోని పరమచెత్త బస్సుల గూర్చి ఏమని సమాధానం చెబుతారు?

## తుమ్మగుంటలో మకరజ్యోతి దర్శనం

తుమ్మగుంటలోని అయ్యప్పస్వామి దేవస్థానంలో సంక్రాంతిని పురస్కరించుకొని ఈ నెల 14తేదీ మకరజ్యోతి దర్శన కార్యక్రమం ఏర్పాటు చేసినట్లు నిర్వాహకులు చెప్పారు. మాగుంట సుధాకర్‌రెడ్డి, శ్రీనివాసులురెడ్డి, విజయకుమార్ రెడ్డి ఈ కార్యక్రమ ఉభయదాతలు.

## వివోలు లేక ఇక్కట్లు

సంగం మండలంలోని పలు గ్రామాలకు వివోలు లేకపోవడం వల్ల రెవిన్యూపరమైన పనుల కోసం ప్రజలు ఇబ్బందులు పడాల్సి వస్తుంది జెండాదిబ్బ, అన్నారెడ్డిపాళెం, పల్లిపాళెం, ముక్తాపురం, దువ్వూరు గ్రామాలకు ఒకే వివో బాధ్యతలు నిర్వహిస్తుండడం కష్టంగా పరిణమించింది. గ్రామాధికారులే జన్మభూమి, పల్స్‌పోలియో, ఇతర ప్రభుత్వ కార్యక్రమాలకు సూత్రధారులు కావడంతో ప్రజల అత్యవసర పనులు నిలచిపోతున్నాయి.

# చూసేకళ్లుంటే వళ్లంతా చూపిస్తా

చూసేకళ్లు ఉండాలేగానీ, సెన్సార్ సమ్మతిస్తే ప్రేక్షకులు ఏం కోరితే అది చూపిస్తానని హీరోయిన్ నమ్రతా శిరోద్కర్ వినమ్రతతో చెబుతోంది. పద్మాలయా స్టూడియోస్ ప్రైవేట్ లిమిటెడ్ దర్శకుడు బి.గోపాల్ దర్శకత్వంలో కృష్ణ, మహేష్‌బాబు హీరోలుగా తీస్తున్న చిత్రంలో నమ్రతా శిరోద్కర్ హీరోయిన్‌గా నటిస్తుంది. షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ ప్రేక్షకులు మా నుంచి ఏది ఆశిస్తారో అది ఇవ్వను మేం రెడీగా లేకుంటే పరిశ్రమలో మనుగడ సాగించలేమంది. ఎవరైనా నన్ను పొడిగితే నేను తట్టుకోలేను. నా అందం నన్ను పిచ్చిదాన్ని చేస్తుంది. ఇక మగ వాళ్ల సంగతి వేరే చెప్పాలా అంటూ నమ్రతా గారాలు పోతోంది. తల దువ్వుకొనేటప్పుడు,

**నమ్రతా శిరోద్కర్**

మొహం కడుక్కొనే టప్పుడు నన్ను నేను అద్దంలో చూసుకొంటాను. అలాగే షాట్‌కి ముందు టచప్ చేసుకొనేటప్పుడు చూస్తాను. నా ముఖం చాలా అందంగా వుంటుందని మదిలో ఒక ఊహ మెదలుతుంది. మనుషులను తొందరగా నమ్మేయడం వల్ల తాను చాలా సార్లు నష్టపోయానని చెప్పింది.

## గొప్ప అదృష్టం

మిలీనియం మార్పును చూసే ఈ తరంలో జన్మించడం నిజంగా చాలా ఆనందంగాను, మరోవైపు గర్వంగాను వుందంది సౌందర్య. ఎందరో మహానుభావులు జన్మించిన ఈ శతాబ్దంలో పుట్టడం నేను చేసుకొన్న అదృష్టంగా భావిస్తున్నానంది. వచ్చే జన్మంటూ వుంటే ప్రజాభిమానం పొందే వ్యక్తిగానే జన్మ కావాలంటుంది సౌందర్య.

# ఛాన్సులు లేకున్నా మానం అమ్ముకోను

హీరోయిన్‌కు వుండాల్సిన అర్హతలన్నీ వుండినా, కెరీర్ ప్రారంభంలో తగిన అవకాశాలు రాలేదని పూజాబాత్రా చెప్పింది. అవకాశాలు రాకపోయినా డబ్బున్న వాళ్లకు మాత్రం వళ్లు అమ్ముకొని బ్రతకలేదని చెప్పింది. మోడలింగ్ కెరీర్ పక్కన పెట్టి సినిమాల్లోకి వచ్చాను. సినిమాల్లో అవకాశాలు వస్తాయా, రావో తెలియక ఎన్నో నిద్రలేని రాత్రుల్లు గడిపాను. కొంత మంది హీరోయిన్లలా ఛాన్సులు లేక డబ్బున్న మగాళ్ల వెంట పడిపోలేదు. విరాసత్, హసీనా మాన్ జాయేగి, భాయ్ వంటి హిట్లు నన్ను ఓదార్చినా, కెరీర్‌కు ఢోకా లేదంటుంది. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగడమే ప్రస్తుత కర్తవ్యమంటుంది.

## శతాబ్దం అంతానికి అంతా క్లోజ్

19వందల సంవత్సరం చివర ఏదో ఒకటి జరుగుతుందని చిన్నప్పుడు ఫ్రెండ్స్ అందరం కల్సి తెగ చెర్చించుకొనేవాళ్లమని

**పూజాభత్రా డంబం**

గ్లామర్ హీరోయిన్ సంఘవి చెప్పింది. ఈ శతాబ్దం పూర్తయ్యేసరికి మనమంతా క్లోజ్ అనుకొని భయపడిపోయే వాళ్లం. అదో పెద్ద దిగులు. ఇప్పుడదంతా తల్చుకొంటే నవ్వేస్తుందని కొత్త శతాబ్దం ప్రారంభం గుర్చి వివరించింది.

## బహుత్ ఖుష్‌హై

ఒక సహస్రాబ్ది వెళ్లి మరో సహస్రాబ్ది వస్తుంటే ఆ కోలాహలాన్ని చూడగలిగే అవకాశం, ఆనందం నాకు దక్కినందుకు చాలా ఖుషీగా వుందని హీరోయిన్ సిమ్రాన్ చెప్పింది. 31తేది సినిమా షూటింగ్‌లన్నీ మానివేసి ఫ్యామిలీతో కలసి హాయిగా ఆడుతూ, పాడుతూ గడిపానంది.

3వ తేది దూరదర్శన్‌లో ప్రసారమైన నేరచరిత్ర నాటికలో నటులు కూర్చున్నవారిలో రఘురామయ్య, గోపాలరావు, ప్రభావతి, రాజగోపాల్, నిల్చున్నవారిలో సుందరరామయ్య, సుబ్బారావు, రవికుమార్ వున్నారు.

# నగ్నంగా నటించిన కమల్

బహు భాషా నటుడు కమల్‌హసన్ హేరామ్ చిత్రంలో ఒక సన్నివేశంలో నగ్నంగా కనిపిస్తాడు. నగ్నంగా నటించే సన్నివేశాన్ని మరుద నాయగం సినిమా కోసం తీశారట. ఆ సినిమా ఇప్పుడల్లా పూర్తయ్యే అవకాశం లేకపోవడం వల్ల హేరామ్ చిత్రంలో దీన్ని వాడుతున్నట్లు తెలిసింది. దక్షిణాది సినిమాల్లో నగ్నంగా మొదట నటించిన హీరో భానుచందర్. నిరీక్షణ చిత్రంలో ఆయన ఈవిధంగా నటించారు.

## తమిళం నేర్చుకోమని చెల్లికి అక్క సలహా!

తమిళ చిత్రాల్లో ఒకప్పుడు ఒక వెలుగు వెలిగినా ఒక్కసారి డౌన్‌ఫాల్‌లో పడిపోవడానికి తాను తమిళం నేర్చుకోక పోవడమే కారణమని నగ్మా శోధించి తెలుసుకొందట. ఇప్పుడిప్పుడే తమిళ సినిమాల్లో రాణిస్తున్న తన సోదరి జ్యోతికకు ఈ పరిస్థితి రాకుండా యమ అర్జంట్‌గా ఒక మాస్టర్‌ను పెట్టి తమిళం నేర్పిస్తుందట.

## రోజాను అభిమానిస్తున్న హీరోయిన్లు

ఈ మధ్య తమిళంలో రోజాకు సినిమాలు పెరిగాయి. ముందు ఒక హీరోయిన్‌ను బుక్‌చేసి తర్వాత ఏవో కారణాల

**హైదరాబాద్ సినిమా వార్తలు**

వల్ల మరో హీరోయిన్‌ను బుక్ చేయడం సాధారణంగా జరుగుతుంది. ఈ మధ్య రోజాకు ఇటువంటి ఆఫర్లు వస్తే వెంటనే అంగీకరించడం లేదట. ముందు అనుకొన్న నటికి ఫోన్ చేసి ఎందుకు చేయడంలేదో తెలుసుకొని తను చేయడం వల్ల ఆ నటికి ఏ ఇబ్బంది లేదంటే... అప్పుడు చెయ్యడానికి అంగీకరిస్తోందట. అందువల్ల పలువురు హీరోయిన్లు రోజాను అభిమానిస్తూ, అభినందిస్తున్నారట.

# గడ్డం అంటే బహుచిరాకు

పంచదార చిలక చిత్రంలో హీరోయిన్ కౌసల్యకు గెడ్డం మీసం వుంచేసుకొనే మగాళ్లంటే ఎలర్జీ అట. చక్కగా షేవింగ్ చేసుకొని వుండే మగవాళ్లు ఎంత అందంగా కనపడతారు? గడ్డం పెంచుకున్న వాళ్లు బూచోళ్లమాదిరి వుంటారని చెబుతోంది.

## ఇళయరాజా కుమారుడు రెహ్మాన్‌కు శిష్యుడట

సంగీత దర్శకుడు ఇళయరాజా కుమారుడు యువన్ శంకర్ రాజా తాను, ఎ.ఆర్. రెహ్మాన్ శిష్యుడనని ప్రకటించుకొన్నాడు. పలు చిత్రాలకు పని చేసినా ఒక హిట్‌ను కూడా శంకర్‌రాజా ఇవ్వలేక పోయాడు. రెహ్మాన్ లాగా రాత్రి 10 గంటలు దాటాక మ్యూజిక్ రికార్డింగ్ చేస్తున్నా అదృష్టం కలసి రావడం లేదంటున్నారాయన.

## జపాన్ చిత్రానికి కోటి మ్యూజిక్

ప్రముఖ సంగీత దర్శకుడు కోటి ఈ మధ్య ఓ జపాన్‌లో చిత్రానికి మ్యూజిక్ అందించారు. ముత్తు, జీన్స్ చిత్రాలు జపాన్ శతదినోత్సవాలు జరుపుకోవడంతో కొందరు

**కౌసల్య**

జపనీయులు తమిళ తారలతో తమిళంలో ఒక చిత్రాన్ని తీశారు. ఈ చిత్రానికి సంగీతం సమకూర్చే బాధ్యతను కోటికి అప్పచెప్పారు. కోటి ఈ చిత్రంలో కూర్చిన నాలుగు పాటలు జపాన్‌లో సూపర్ హిట్టయ్యాయి.

# ఆదర్శాల కల్పవల్లి 'ఆవిడే శ్యామల'

"ఆవిడే శ్యామల" చిత్రం పేరులో ఎంతో అంతర్యముంది. ఆ అంతర్యం శ్యామల పాత్రలో ఉన్న గొప్పతనమే. ధైర్యం స్థైర్యం, సాహసం, ఆత్మాభిమానం, ఆదర్శం మూర్తీభవించిన పాత్ర అది. అందువల్లనే ఆ పాత్రను చూపించి "ఆవిడే శ్యామల" ఆమెను చూసి నేర్చుకోండి అని అందరూ అంటూ వుంటారు. ఆమెను చూసినవాళ్లు స్ఫూర్తిని పొందుతుంటారు. వినూత్నమైన, విభిన్నమైన ఆ పాత్రను ఆధారం చేసుకొని కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఆర్. సీతారామరాజు "ఆవిడే శ్యామల" చిత్రాన్ని నిర్మించాడు. మలయాళంలో అవార్డు పొందిన "చింతా విష్టయామె శ్యామల" అనే చిత్రం ఆధారంగా ఈ చిత్రం నిర్మించబడింది.

ప్రపంచ వ్యాప్తంగా స్త్రీకి ఇటు సమాజంలోను అటు సంసారంలోను సమస్యలు ఎదురవుతూనే వున్నాయి. ఇవి సర్వసామాన్యమై పోయాయి. ఇవి రకరకాల సాధింపులు, వేధింపులుగా మారుతున్నాయి. సంసారంలో భార్యాభర్తల మధ్య గిల్లికజ్జాలు కొంత మనస్పర్థలు తెచ్చినా, అవి మరుక్షణంలో అటు భర్తో ఇటు భార్యో ఎవరో ఒకరు చొరవ తీసుకోవటంతో ఇద్దరి మధ్య స్పర్థలు సమసిపోతూ వుంటాయి. నిజానికి భార్యాభర్తల మధ్య తరచూ గిల్లికజ్జాలుంటేనే ఆ దాంపత్యం సంతోషంగా సాగిపోతుంది. అలా కాకుండా భర్త దుర్మార్గం తీవ్రరూపం దాల్చి ఒక రాక్షస కక్షతో భార్యను రాచి రంపానపెట్టుంటే ఆ భార్య జీవితం దుర్భర మవుతుంది. ఇలా విలన్ లాంటి భర్త మూలంగా సమస్యల ఊబిలో చిక్కొని, చితికిపోయినా, నిరాశపడకుండా ఆ తర్వాత ధైర్య, స్థైర్యాలను కూడగట్టుకొని, సాహసించి, సంసార సాగరాన్ని ఈది గట్టుకు చేరి, దాంపత్యం సుఖమయం చేసుకున్న ఆదర్శనీయమైన ఒక భార్య కథే ఈ చిత్రం. ఇందులో ఆ భార్యే శ్యామల. నడి సంసార సముద్రంలో ఇరుక్కొని మునిగి సతమత మవుతున్న భార్యలంతా శ్యామలను ఆదర్శంగా తీసుకొని ఈత నేర్చుకొని ఒడ్డుకు చేరేందుకు సాహసించాలి అన్న సందేశాన్ని ఈ చిత్రం అందిస్తుంది.

శ్యామల పాత్రను రమ్యకృష్ణ పోషించింది. స్త్రీ జీవితాని ఒక మార్గదర్శకంగా

**చిత్రసమీక్ష**
◆ ◆ ◆
**గ్రిద్దలూరు గోపాలరావు**

మలచబడిన ఈ పాత్రలో రమ్యకృష్ణ చాలా సహజంగా, విశిష్టంగా నటించింది. వక్రబుద్ధిగల భర్త సూటిపోటి మాటలను, మనసును గాయపరిచే చేష్టలను భరించిన సహనాన్ని ఆమె చక్కగా ప్రదర్శించింది. లోకంలోని అన్ని బాధ్యతలు తననెత్తిమీదే వున్నట్లు తిరుగుతూ, డబ్బు సంపాదనే ధ్యేయంగా వుంచుకొని భార్యను నిర్లక్ష్యం చేసే భర్తను తన సరసనే నిలుపుకొనేందుకు "ఏమండి అలావున్నారేమండి, అప్పుడే వెళతారేమండి" అని పాడుతూ తన కష్టాల కాపురాన్ని కళ్లకు కట్టినట్లు చెపుతూ, తన ప్రేమాను రాగాలను వెలిబుచ్చి మనసులో దాచిపెట్టిన రమ్యకృష్ణ హావభావాలు మెచ్చుకోతగినవి. జీవితంలో నిరాశను విడిచి, సంఘర్షణను ఎదుర్కొనేందుకు ధైర్యసాహసాలను కూడగట్టు కోవటంలో పడ్డతపన చేసిన ప్రయత్నం వీటిలో ఆమె నటన పరాకాష్టనందుకుంది. భర్త తనకు ఎంత దూరమవుతున్నా, అతనిలోని దుర్మార్గం తననెంతగా తరుముతున్నా, నొసటి కుంకుమ మెడలో మంగళసూత్రం, పాదాల పసుపు, ముంజేతి గాజులు నిలుపుకొనేందుకు, హిందూ సాంప్రదాయ భారత స్త్రీకి ప్రతీకగా, భర్తకోసం దీక్షతో నోములు నోచిన విధానం బాగా ఆకట్టుకుంటుంది. ఇలా భర్త కోసం తపస్సు చేస్తూనే, తన కుటుంబ గౌరవం కోసం, తన బిడ్డ భవిష్యత్తు కోసం భర్తలోని దుర్మార్గంపై పోరాటానికి సాహసిస్తుంది. ఈ విభిన్న నిర్ణయాల్లో ఆమె నటన విశిష్టతను సంతరించుకుంది. వైవిధ్యంతో కూడుకున్న ఈ పాత్ర రమ్యకృష్ణ నట జీవితంలో గుర్తుంచుకో తగింది. దర్శకుడు ఈ టైటిల్ పాత్రను ఆమోదయోగ్యంగా మలిచాడు. ఈ పాత్ర వల్లనే ఈ పాత్రలో రమ్యకృష్ణ నటన వల్లనే చిత్రం ప్రేక్షకుల ఆదరాభిమానాలను పొందింది.

ప్రకాష్‌రాజ్, శ్యామల భర్త పాత్రను ప్రత్యేక ధోరణిలో పోషించి రక్తి కట్టించాడు. రఘుబాబు, జానకి, ఆలీ, గుండు హనుమంతరావు, ఎం.ఎస్.నారాయణ హాస్యం బాగుంది.

డి.నారాయణ వర్మ మాటలు సన్నివేశాలకు సత్తువ కలిగించాయి. అక్కడక్కడా గిలిగింతలు పెట్టి నవ్వించాయి.

తరువాయి 11వ పేజీలో

# రాజకీయాల్లో అజేయుడు, కీర్తిలో అజరామరుడు ఏ.సి.

## నెల్లూరు సిగలో నెలవంకలు

నెల్లూరు జిల్లా రాజకీయ చరిత్రను, తన జీవిత చరిత్రగా మలుచుకున్న మహోన్నత నేత ఏసి. సుబ్బారెడ్డి. తాను రాజకీయంగా ఎదగడమే కాకుండా, జిల్లాను కూడా తన స్థాయికి పెంచిన సమున్నత మూర్తిత్వం ఆయనది. జిల్లాలో రాజకీయ అధికారాన్ని సంపన్నుల చెరనుంచి విడిపించిన ఉక్కు మనిషి ఎ.సి. సుబ్బారెడ్డి దేహి అని దేబిరించకుండా పాహిమాం అంటూ శరణు కోరకుండా, 45ఏళ్లపాటు నిస్వార్థ ప్రజాసేవతో అంచెలంచెలుగా అధికార అందలాలను అధిరోహించిన సమర్థ నాయకుడు ఎ.సి విరోధులకు ఆయనొక ధీరోధాత్త శత్రువు. నమ్ముకుంటే కోరకుండా వరాలిచ్చే కామధేనువు. నెయ్యమైనా, కయ్యమైనా ఎ.సి.తోనే రక్తికడుతుందన్న నానుడి ఆనాటి రాజకీయ ప్రముఖుల్లో ప్రబలంగా వినిపించేది. సింహపురి సీమకు ఎ.సి. నిజంగా సింహబలుడు. దేశవిముక్తి కోసం పోరాటం జరుగుతున్న కాలంలో 1930 ప్రాంతాలలో బ్రిటీష్ దొరల పెత్తనాన్ని ధిక్కరించి, సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు ఎ.సి.కి ఆరునెలల జైలు శిక్ష విధించారు. జంది ఖానా నుంచి బయటపడిన తర్వాత, ఆనాటి రైతాంగ దుస్థితిపై పోరాటానికి నడుంకట్టి ఎన్నో రైతు ఉద్యమాలకు ఊపిరి పోశాడు. బ్రిటీష్ హయాంలోనే 1937 సంవత్సరంలో ఎసి. సుబ్బారెడ్డి నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. ఐదిసంవదల్లో, మిన్నకాక పోయినా పెద్దగా చదువు సంధ్యలు లేకున్నా, స్వతసిద్ధంగా సంక్రమించిన నాయకత్వ లక్షణాలు, సామాన్య ప్రజానీకంతో మమేకం కాగలిగిన మనస్తత్వమే, ఎ.సి.ని మున్సిపల్ గద్దెపై కూర్చుండబెట్టింది. 23 సంవత్సరాల పాటు ఆయన ఏకచ్ఛత్రాధిపత్యంగా నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్‌గా కొనసాగి, రికార్డు సృష్టించారు.

ఆనాడు ఎ.సి. సుబ్బారెడ్డి నాటిన రాజకీయ బీజమే వటవృక్షమై నేటి ఆనం వంశ రాజకీయాలకు నీడ నిచ్చింది. ఆనం కుటుంబం రాజకీయ ప్రభావం 70 ఏళ్లపాటు, అవిచ్ఛిన్నంగా, అప్రతిహతంగా వెలిగి పోవడానికి ఆద్యుడు ఎ.సి. సుబ్బారెడ్డే రాష్ట్రంలో ఏ జిల్లాలో కూడా ఇంత సుదీర్ఘ కాలం, ఒక కుటుంబ రాజకీయ సమరంలో నెగ్గుకు రావడం జరగలేదు. రాష్ట్ర రాజకీయాల్లో ఎన్ని ఆటుపోట్లు వచ్చినా, ఎ.సి. సుబ్బారెడ్డి వేసిన పునాదులపై నిర్మించిన ఆనం రాజకీయ సౌధం మాత్రం చెక్కుచెదర లేదు. ఆయన నాయకత్వ పటిమకు ఇంతకంటె నిదర్శనం అవసరం లేదు.



> నెల్లూరు జిల్లా రాజకీయ చరిత్రను తన జీవితంగా మలుచుకున్న ఉక్కు మనిషి ఏ.సి.
> దేహి, పాహిమాం అన్నపదాలకు అర్థం తెలియని అభిజాతుడు.
> విరోధులకు ధీరోదాత్త శత్రువు, ఆశ్రితులకు వరాలిచ్చే కామధేనువు.
> దివికేగుతూ ఆయన వెలిగించిన చిరుదివ్వే, ఆనం వంశ రాజకీయ ప్రాభవానికి 70 ఏళ్లుగా వెలుగు నిస్తూనే వుంది!

1952 సంవత్సరంలో ఎసి నెల్లూరు నుంచి అసెంబ్లీకి పోటీ చేసి ఖండవల్లి కృష్ణారావు చేతిలో ఓడిపోయారు. పరాజితుడైనా, జిల్లా రాజకీయాలను తన కనుసన్నలలోనే నడిపాడు. తర్వాత జరిగిన ఎన్నికల్లో ఎ.సి.ని శాసనసభ్యత్వం వరించింది. మంత్రి పదవులు కోరకుండానే వచ్చి దామోదరం సంజీవయ్య మంత్రివర్గంలో మున్సిపల్ వ్యవహారాల మంత్రిగా పనిచేశారు. బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో విద్యుత్ మరియు ఇరిగేషన్ శాఖామంత్రిగా, నెల్లూరు జిల్లాలో ఆయన అనేక అభివృద్ధి కార్యక్రమాలకు ఆద్యుడయ్యారు. జిల్లాలో లెక్కకు మించి లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలు ప్రవేశపెట్టిన ఘనత ఎ.సి.దే. విద్యుత్‌శాఖ మంత్రిగా ఆయన జిల్లాలో సమగ్ర విద్యుదీకరణకు ఎనలేని కృషి చేశారు. నీలం సంజీవరెడ్డి మంత్రి వర్గంలో రాష్ట్ర భవనాలు, ఇరిగేషన్, విద్యుత్ మంత్రిగా పనిచేసి జిల్లాకు కొత్త రూపు తెచ్చారు. బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో హోం శాఖ మంత్రిగా పనిచేశారు. ఆయనతో ముఖ్యమంత్రిత్వానికి పోటీ పడి ఎదురు నిలిచారు. ప్రధానమంత్రి నెహ్రూ అడ్డు పడి ఎ.సి.కి నచ్చచెప్పి పోటీ నుంచి విరమింపజేశారు. ఎ.సి. సుబ్బారెడ్డి ఆజానుబాహుడు, స్ఫురద్రూపి. రాజకీయాలలో తనకంటె పెద్దవారిని కూడా తన వెనకవారుగా మలుచుకోగలిగిన రాజకీయ చాణుక్యుడు ఎంతో నేర్పుతో, ఓర్పుగా, స్వయం ప్రతిభతో, స్వయం ప్రకాశుడైన ఎ.సి. రాష్ట్ర రాజకీయాల్లో మహామహులకు సహచరుడుగా మెలిగాడే తప్ప, అనుచరుడు కాలేదు. ఎవరికైనా సహాయం అందించినవాడేకానీ, అందుకున్నవాడు కాదు ఎ.సి. అంటే నెల్లూరు, నెల్లూరంటే ఎసి అన్న పేరు తెచ్చాడు. నిర్మలత్వం, నిర్భయత్వం, నిష్కాపట్యం ఎ.సి.కి కవచ కుండలాలు. స్వతంత్ర ప్రతిపత్తి, అభిజాత్యం, ఆత్మాభిమానం ఆయన వ్యక్తిత్వానికి ఆభరణాలు. ఇవే ఆయన ముఖ్యమంత్రిత్వానికి అడ్డుగోడలై నిలిచాయి. అయితే పదవులతో ఎ.సి.ని కొలవడం మూర్ఖత్వమే. సామాన్య ప్రజానీకంతో ఆయన కలుపుగోలుతనం, జిల్లా అభివృద్ధిపై ఆయనకున్న తపన ఎ.సి. కీర్తిని అజరామరం చేశాయి. ఎ.సి. హృదయం ఎంత నిర్మలమో, ఆయన మాటతీరు అంత కఠినంగా ఉంటుంది. నాటి రాజకీయ పరిశీలకులు ఎ.సి.ని ప్రజారంజకుడైన నియంత అనేవాళ్లు.

నెల్లూరులో హరిజన హాస్టళ్లకు స్థలం కావాలని తారట్లాడుతున్న కాలంలో, స్థలంతోపాటు ఒక ఇంటిని కూడా వసతిగా హరిజన హాస్టల్ ఏర్పాటుకు సహకరించినవాడు. రాజకీయ బాధితుడుగా తనకు వచ్చిన ఐదెకరాల భూమిని, కస్తూరిదేవి స్కూలుకు దానం చేసింది ఎ.సి. సుబ్బారెడ్డి అన్న నిజం ఎంత మందికి తెలుసు? రాజకీయాల్లో నూటికి నూరు పాళ్లు ప్రజాసేవకే వినియోగించిన పరిపూర్ణ నాయకుడు ఆయన. అందుకు ఎ.సి. పరలోక యాత్ర రాష్ట్ర చరిత్రలో నిలిచిపోయింది. ఆయన నిర్యాణం రాజకీయాల్లో ఒక అధ్యాయమైంది.

1967 సంవత్సరం సెప్టెంబర్ 20వ తేది ఎ.సి. సుబ్బారెడ్డి క్యాన్సర్ వ్యాధితో

తరువాయి 12వ పేజీలో

## వారఫలాలు

8.1.2000తేది నుండి 14.1.2000తేది వరకు; మేషంలో గురువు, వక్రశని; కర్కాటకంలో రాహువు; ధనుస్సులో రవి, బుధులు; వృశ్చికంలో శుక్రుడు; మకరంలో కేతువు; కుంభంలో కుజ; మకర, కుంభ, మీనాలలో చంద్రుడు.

### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

మీరు పడుతున్న శ్రమకు తగిన ప్రతిఫలం పొందలేరు. ఆర్థికస్థితి బాగున్నట్లుగ అనిపించును. కుటుంబ సభ్యులకు కొద్దిపాటి అనారోగ్యముంటుంది. సోదరులతో కొద్ది వివాదాలు కలుగవచ్చును. అధికార కార్యక్రమాల వల్ల విశ్రాంతి వుండదు. రాజకీయ, సాంస్కృతిక రంగాలలో నున్నవారికి గుర్తింపు, రాణింపు తక్కువ. ఉద్యోగులు పని నిర్వహణలో జాగ్రత్త పడాలి.

### వృషభం
(కృత్తిక 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఖర్చులు పెరిగి దాచిన డబ్బును తీయడంగాని, రుణంగాని చేయవలసి వస్తుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలు అంతంతమాత్రంగానే ఉంటాయి. ఇవ్వవలసిన బాకీలపై వత్తిడి ఉంటుంది. అనవసరంగా నిందలపాలు కావచ్చును. అధికార వర్గాల వల్ల సమస్యలు, శ్రమ పెరుగుతుంది. దూర ప్రయాణాలు చేస్తారు. విద్యార్థులకు ప్రగతి బాగుంటుంది. ఇతరులకు చేతనైన సహాయ సహకారాలు అందిస్తారు. ఆరోగ్యం సరిగా ఉండదు.

### మిధునం
(మృగశిర 3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

బంధువర్గం వల్ల అనవసర తగాదాలు, సమస్యలు రావచ్చును. కుటుంబ వ్యక్తులకు ఆరోగ్య లోపం కలుగుతుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయాలలో ఆదాయం సామాన్యంగా ఉంటుంది.

### కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

ఆర్థిక పరిస్థితి బాగుండదు. కొంత రుణ భారం పైనబడుతుంది. మనస్థిమితం లేనందువల్ల ఇతరులను సందేహిస్తారు. కుటుంబ ఖర్చులు పెరుగుతాయి. బంధుమిత్రులతో చిన్న చిన్న విషయాలలో తగాదాలు రావచ్చును. అధికార వర్గాన్ని గమనించుకొని విధులు నిర్వహించండి. సొంత ఆర్థిక పనులు, శుభకార్య ప్రయత్నాలు వాయిదా పడతాయి.

### సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

అధికార వర్గ సహకారం బాగుంటుంది. మీ సామర్థ్యంతో ఆఫీసు పనులు, ఇంటిపనులు చక్కబడగలవు. పెండింగ్ పనులు పరిష్కారానికి వస్తాయి. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. వ్యాపార విస్తరణకు, స్థిరాస్తుల క్రయానికి ప్రయత్నాలు జరుగవచ్చును. భార్యా బిడ్డలతో విభేదాలు స్వల్పంగా ఉండి సర్దుకుంటాయి. కొత్త వస్తువులు కొనడం, వాహన రిపేర్లుంటాయి. ఇతరులకు మాట, డబ్బు రూపంలో సహాయపడతారు.

### కన్య
(ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త; చిత్త 1,2 పాదాలు)

పాత కేసులు, తగాదాల పరిష్కారానికి మూల్యం చెల్లించవలసి వస్తుంది. ఆర్థిక ప్రగతి బాగుంటుంది. రావలసిన రుణాలు, ప్రభుత్వ సహాయాలు నిలబడిపోతాయి. విద్యార్థులు విద్యా ప్రగతిలో శ్రమపడతారు. రాజకీయ రంగంలో ఎదురు దెబ్బలు తగులవచ్చును.

### తుల
(చిత్త 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ఈ రాశి వారికి ఆర్థికంగా బాగుంటుంది. స్తంభించిన పనులు మరల కొనసాగగలవు. పెట్టుబడి రంగానికి, వ్యాపార వృత్తి విస్తరణకు మంచి అవకాశాలుంటాయి. ఇతరుల సలహా మీద ఆధారపడతారు. కుటుంబ సౌఖ్యం, విద్యార్థులకు ప్రగతి బాగుంటుంది. నూతన ఉద్యోగావకాశాలు లభిస్తాయి. దూర ప్రయాణాలుంటాయి. ప్రభుత్వ సంబంధమైన పనులు మాత్రం సరిగా జరుగవు.

### పంచాంగం

14తేది శుక్రవారం వరకు శూన్యమాసం

పండుగలు

14తేది భోగి పండుగ 15తేది సంక్రాంతి, ఉత్తరాయణ పుణ్యకాలం

జనవరి తిథులు

పుష్య శుద్ధ

తేది 8 శని విదియ రా 2.40 గం.వ
తేది 9 ఆది తదియ రా 3.50 గం.వ
తేది 10 సోమ చతుర్థిరా 4.40 గం.వ
తేది 11 మంగళ పంచమిరా4.45 గం.వ
తేది 12 బుధ షష్ఠి రా 4.15 గం.వ
తేది 13 గురు సప్తమిరా 3.20 గం.వ
తేది 14 శుక్ర అష్టమి రా 2.05 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ

### వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

పెడుతున్న ఖర్చులకు, వచ్చే ఆదాయం సరిపోతుంది. ఆర్థిక లావాదేవీలలో మాత్రం జాగ్రత్త పడండి. తొందరపడి హామీలు, అప్పులు ఇవ్వవద్దు. శుభకార్య ప్రయత్నాలు చేయవచ్చును. విద్యా రంగంలో కృషి తగ్గుతుంది. నూతన ఉద్యోగావకాశాలు లభిస్తాయి. కుటుంబ సభ్యులకు సహకారమే సరిగా ఉండదు. సాంస్కృతిక కళా రంగంలో ఉండేవారికి ప్రోద్బలం ఉంటుంది.

### ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో రాబడి, ఖర్చులు సరిసమానంగా ఉంటుంది. కుటుంబ ఖర్చులు పెరుగుతాయి. కుటుంబ సభ్యుల అనారోగ్యం వాహన రిపేర్లు, బంధువియోగ వార్తలు వింటారు. ఉద్యోగ పనులు, సొంత పనులు సవ్యంగా జరిగిపోతాయి. అధికారుల సహకారం, గౌరవ ప్రతిష్ఠలు, కార్యనిర్వహణ సామర్థ్యం బాగుంటుంది. ఆరోగ్యం మీకు ఫరవాలేదు. విద్యా రంగంలో కృషి బాగుంటుంది. నూతన వస్తువులు కొంటారు. బంధుమిత్రుల రాకపోకలు,వ్యాపారవృద్ధి ప్రయత్నాలు, పెట్టుబడులు బాగుంటాయి.

### మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఆర్థిక బాధలుంటాయి. రావలసిన బాకీలు రాక, వృత్తి, వ్యాపారాలలో ఆశించిన ఆదాయం రాక ఇబ్బంది పడతారు. అప్పుడప్పుడు టెన్షన్ ఉంటుంది. అనుకున్న పనులు నిదానంగా జరుగుతాయి. విద్యార్థులు మంచి కృషి చేస్తారు. అధికార యంత్రాంగాన్ని గమనించుకొని ఉద్యోగులు బాధ్యతలు నిర్వహించాలి. కుటుంబంలో చిన్న చిన్న కలతలుంటాయి. బంధువర్గాల నుంచి శుభవార్తలు వింటారు. వారాంతంలో కొద్దిపాటి అనారోగ్యం ఉంటుంది.

### కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

వృత్తి, వ్యాపార పరిశ్రమల రంగంలో ఆదాయం పెరుగుతుంది. అధికార వర్గాన్ని గమనించుకోవాలి. ఉద్యోగస్తులు అదనపు బాధ్యతలతో సతమతం కాగలరు. అయినా అధికారుల సహకారం వారికుంటుంది. వారం ప్రారంభంలో కొద్దిపాటి అనారోగ్యం ఉంటుంది. పెట్టుబడులకు, వ్యాపారవృద్ధికి మంచి అవకాశాలు వస్తాయి. కొత్త వస్తువులు కొంటారు.

### మీనం
(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ రాశి వారికి అన్ని విధాల ఆదాయం పెరిగినా, కుటుంబ ఖర్చులు, అనవసర ఖర్చులు తప్పవు. బంధువుల రాకపోకలు, కొత్త వస్తువులు కొనడం, వాహన రిపేర్లుంటాయి. పెట్టుబడులలో, వ్యాపార విస్తరణకు అవకాశాలు లభిస్తాయి. కుటుంబ సభ్యుల మధ్య చిన్న తగాదాలుంటాయి. అధికార వర్గం యొక్క పూర్తి సహకారం ఉంటుంది. వారాంతంలో ఆరోగ్యం సరిగా ఉండదు. సొంత పనులకు డబ్బు ఖర్చు చేసి సాధించుకోవాలి. విద్యావృద్ధి బాగుంటుంది. సాంఘిక, దైవ కార్యాలలో పాల్గొంటారు.

# జనవాణి

3వ పేజీ కొరవ

వుంటుంది. ఇష్టమొచ్చినట్లు రేట్లు పెంచే అధికారం ప్రైవేట్ బస్సుల యాజమాన్యానికి ఎవరిచ్చారు? ఈ విషయాన్ని జిల్లా కలెక్టర్ ఒకసారి పరిశీలిస్తే బాగుంటుంది.

నెల్లూరు — ఎ. నరసింహారావు

## ప్రభుత్వాల బాధ్యతా రాహిత్యం

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థల నుంచి విపరీతంగా అప్పులు తెస్తున్నాయి. కాని ఈ అప్పులెలా తీరుస్తారో చెప్పేవారు కానరావడం లేదు. ప్రపంచ బ్యాంకు మనదేశం ఎలా నడుచుకోవాలో సూచిస్తూ పంపుతున్న ఆదేశాలను మన వాళ్లు పాటిస్తూ, దేశాన్ని ఊబిలో ఇరికిస్తున్నారు. ప్రభుత్వాలు ఇంత బాధ్యతా రహితంగా ఎందుకు పని చేస్తున్నాయో అర్థం కావడం లేదు.

నెల్లూరు — కె.విజయ

## కస్తూరిదేవి స్కూల్ వద్ద వీధిలైట్లు లేవు

నెల్లూరు కస్తూరిదేవి స్కూల్ వద్ద మునిసిపల్ వీధిలైట్లు వెల్గడం లేదు. మెయిన్‌రోడ్డులోనే పరిస్థితి ఈ విధంగా వుంటే ఎలా? ఈ ప్రాంతంలో వెనువెంటనే వీధిలైట్లు వెల్గించేందుకు మునిసిపాలిటి కృషి చెయ్యాలి.

నెల్లూరు — శివరాంసింగ్

## మిలీనియంలో మిలియన్ల సందడి

ఆస్ట్రేలియా హార్బర్‌లో పై ... స్వర విహారం చేసిన సంబరాలు, వైరాంబ్ బదియాదీలంలో 2వేల బంటలలో విద్యావిషమంత విహా వేడికలు అదే దేశంలో తొలి సూర్యకిరణం తాకిన అనుభూతి తాలుకు గుండెల శబ్దాలు మరి ఇండియాలో? హైజాకర్ల అరాచకపు అంచున హైజంప్ చేసిన పన్నుల ధరలు.

నెల్లూరు — డాక్టర్ ఎన్. జయప్రద

## బ్యాంకు మార్చండి

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఇందుకూరుపేట శాఖను కొత్తూరులో నడుపుతున్నారు. ఇందుకూరుపేట నుంచి నిత్యం లావాదేవీలు నడిపేవారు, పెన్షనర్లు ఇబ్బంది పడుతున్నారు. కొత్తూరులో ఇప్పటికే ఆంధ్రాబ్యాంక్ వున్నందున స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాను ఇందుకూరుపేటకు మార్చమని మనవి.

ఇందుకూరుపేట — పి. శ్రీకృష్ణయ్య

## మిలీనియం ప్రారంభం కాలేదు

రెండు వారాల క్రితం జమీన్‌రైతులో తూపిలి వనమాలి గారు వ్రాసినట్లు మిలీనియం సంవత్సరం 31.12.2000 అర్ధరాత్రి 12 గంటలకు వస్తుంది. కాని ఈ విషయాన్ని అందరూ మరచిపోయి గ్లోబల్ ప్రచారం మాయలోపడి ఇప్పుడే మిలీనియం సంవత్సరంలో అడుగిడినట్లు సంబరాలు చేసుకొన్నారు. ఇది సరికాదు.

నెల్లూరు — బి. బాలాజీసింగ్

## వ్యాసం బాగుంది

నెల్లూరుజిల్లా పుట్టు పూర్వోత్తరాలు శీర్షిక పేరిట చరిత్రకారుడు డాక్టర్ సి.వి. రామచంద్రరావు జమీన్‌రైతులో వ్రాస్తున్న వ్యాసం బాగుంది. చైత్రాహిక చారిత్రక పరిశోధనలు, జిల్లా చరిత్ర తెలియని వారు వ్యాసాన్ని కత్తిరించి జాగ్రత్త చేసుకోవాల్సినంత విలువైనది. చక్కని వ్యాసం ప్రచురిస్తున్న మీకు ధన్యవాదాలు.

నెల్లూరు — వీణారమాపతి రాజు

## రైలులో ఎమ్మెల్యే ప్రవర్తన బాధాకరం

రెండు వారాల క్రితం జమీన్‌రైతు జనవాణి శీర్షికలో తూపిలి వనమాలి గారు వ్రాసిన ఉత్తరంలో ఒక తాగుబోతు బిజెపి ఎమ్మెల్యే విషయం చదివి ఆశ్చర్యపోయాను. ఈ ఎమ్మెల్యే ఆర్ఎస్ఎస్ కార్యకర్త అని పేర్కొన్నారు. ఆర్ఎస్ఎస్ కార్యకర్తలందరూ ఈ విషయమై బాధపడుతున్నారు. దయచేసి ఆ ఎమ్మెల్యే పేరు బయట పడితే బాగుంటుంది.

నెల్లూరు — బి.వాసు

ఎ.వేణుగోపాలరావు

## రాజీవ్‌ను నిందించకండి

బోఫోర్సు కేసు విషయంలో రాజీవ్‌గాంధీ నిందితుడని బిజెపి ప్రభుత్వం చేస్తున్న ప్రచారం సరైంది కాదు. మరణించిన ఒక మహానుభావుడైన వ్యక్తిపై ఈ విధమైన బురద చల్లడంతగదు. బోఫోర్సు తుపాకుల వల్లే కార్గిల్ యుద్ధంలో భారత సైనికులు విజయం సాధించారన్న విషయాన్ని వాజ్‌పేయి మరచిపోతున్నారు.

నెల్లూరు — వి.రామయ్య

## మహిళా మండలి ముసుగులో వ్యభిచారం!

మహిళా మండలి ముసుగులో వ్యభిచార గృహం నడపడం లజ్జాకరం. పడుపు వృత్తి లేకుండా సంస్కరించాల్సిన మహిళా మండళ్లే ఈ స్థాయికి దిగజారడం బాధాకరం. వ్యభిచార గృహాలు రాజకీయ నాయకులు, పోలీసుల శయన మందిరాలు కావడం వల్లే వీటి వైభోగం కొనసాగుతుంది. 1972లో దర్గామిట్ట, రామ్‌నగర్‌లో నడుస్తున్న వ్యభిచార గృహం సమాచారం, అప్పటి ఎస్పీ శ్రీకాంత్‌రెడ్డికితెలియజేసి దాన్ని దగ్గరుండి ఖాళీచేయించిన ఉద్యమ స్ఫూర్తితో భారతి మహిళా మండలి పనిచేసింది.

నెల్లూరు — అరిగెల రాజేశ్వరమ్మ

## వ్యభిచారులకు రాజకీయుల అండ?

నెల్లూరులోని వ్యభిచార గృహాల బండారం బైట పెడుతూ నిర్భీతిగా వార్త వ్రాసినందుకు అభినందనలు. ఏ పత్రిక కూడా ఈ వ్యవహారంలో ఇంత సాహసం ప్రదర్శించలేదు. జారిణుల నాయకురాలికి, బడా రాజకీయ నాయకులు, పోలీసులు, ఇతర ఉన్నతాధికారులు వత్తాసు పలకడం ఆత్మహత్యా సదృశ్యమే.

ఎం. సుందరామిరెడ్డి

## సైన్సే బెస్ట్

సాంఘిక శాస్త్రాలను చదవడం అనవసరమని ముఖ్యమంత్రి చేసిన వ్యాఖ్య సమంజసమైనదే. గతించిన సంస్కృతి గూర్చి ఈ రోజు చదవ వలసిన అవసరం లేదు. అదే సామాన్య శాస్త్రమైతే మానవుని అభివృద్ధి నిత్యం దోహదపడుతుంది. సాంఘిక శాస్త్రాల అధ్యయనం మూలంగానే సమాజంలో ఎన్నో రుగ్మతలు కలుగుతున్నా యనడం వాస్తవం.

నెల్లూరు — వాస్తు రామచంద్ర

## కావలి మునిసిపాలిటీకి కొత్త పాలకులు కావాలి

కావలి మునిసిపాలిటీని ఉత్తమ మునిసిపాలిటీగా ముఖ్యమంత్రి గతంలో శ్లాఘించారు. కాని ఈ పట్టణంలో ఏ రోడ్డు చూసినా చెత్తమయమే. వాటిపై పందులు స్వైరవిహారం చేస్తుంటాయి. డ్రైనేజీలు శుభ్రపరిచే వారు లేరు. దోమల గూర్చి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. జెట్, టార్నాయిన్‌లు ఇక్కడి దోమలను ఏం చేయలేవు. వీధిలైట్లు వెలగవు. నీటి సరఫరా అస్తవ్యస్తమే. దుస్థితిలో వున్న పుర పాలన సక్రమ రీతిలో సాగాలంటే సచ్ఛీల చరిత్ర గలిగిన కొత్త ముఖాలను పురపాలకులుగా ఎన్నుకొంటే బాగుంటుంది.

కావలి — ప్రొఫెసర్ నాగరాజారావు

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

తెల్పడానికి!

### మదరాసు క్రీడారంగం

మదరాసులో రాజకీయ వస్తాదుల కుస్తీలు జరుగుతున్నాయి. కళావారు చేతులు దులుపుకొని గోదాములో నిలబడి సిద్ధంగా వున్నారు. అటు గోపాలురెడ్డిగారు, ఇటు ప్రకాశంగారు, ఇంకోవైపు రంగాగారు, వీరందరితో పాటు చంద్రమౌళిగారు బలాబలాలతో సిద్ధమయ్యారు. కాని వచ్చిన చిక్కేమిటంటే ఆ గోదాములో ఎవరెవరు ఏవి పక్షంచేరారో యింకా తెలియడం లేదు. తెలుసా లేదు. ఈ కుస్తీ మంత్రివర్గ నిర్మాణంలో మాత్రమే. రాష్ట్రం తేవడంలో అందరూ ఏకటంబ్యూనట్లు అందరికీ తెలిసిందే!

### శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డిగారి నిర్యాణము

వదాన్యశేఖరుడు మనకు పురమందిరాన్ని ప్రసాదించిన స్వర్గీయ రేబాల లక్ష్మీనర్సారెడ్డి గారి తమ్ముని పుత్రుడున్నూ, అన్నగారి దానధర్మాల పరిపాలించుటేగాక, స్వయంగా యెన్నోధర్మాల చేసిన సుందరరామిరెడ్డిగారి జ్యేష్ఠ పుత్రుడున్నూ, పితృదానధర్మాల పాలనావ్యవహారాన్ని చక్కగా నిర్వహిస్తుండిన లక్ష్మీనరసారెడ్డి గారి అన్నయున్నూ శ్రీ మంత్రి గోపాలరెడ్డి, మైసూరు విద్యాధికారి కట్టమంచి రామలింగారెడ్డి గార్లకు సన్నిహిత బంధువున్నూ అయిన శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డి గారు క్రూరవ్యాధితో బాధపడుతూ 3-1-50తేది ఉ.5.15 గం.లకు దేహధర్మము చాలించిరి.

### యం.యస్. సుబ్బులక్ష్మీ పాటకచ్చేరి

నెల్లూరులో శ్రీ కస్తూరిదేవి విద్యాలయ సహాయార్థం ప్రధాని, శ్రీ కుమారస్వామి రాజా అరికమంత్రి, శ్రీ గోపాలరెడ్డి గారల ఆధ్వర్యమున శ్రీ యం.యస్. సుబ్బులక్ష్మీ పాటకచ్చేరి 5.3.50తేది ఆదివారం జరుగును.

### నెల్లూరు ముచ్చట్లు పెన్నవంతెన

వెందర్లు ఏలివారు దినాలు, వారాలు, మాసాలైనా యింకా పరిష్కారం కాలేదు. 'ఆంధ్రరాష్ట్రావతరణ శుభసమయే ఢిలీ కారణాభ్యేన్నమః కాబోలు?

వర్ణించెవాడు మనవాడైతే గడుంబరివ

ఆటో ఐడ్రో ఫౌండేషన్ ఆఫ్ అమెరికా నాటకోత్సవాల సందర్భంగా జ్యోతి ప్రజ్వలన గావిస్తున్న పులుగొండ్ల రామకృష్ణయ్య ప్రక్కన రామసుబ్బారెడ్డి, బలరామిరెడ్డి, శాస్త్రి, ఆచార్య, నవనాధరావు

కూర్చేమన్నాడు తెనాలిరామలింగడు.

ప్రత్యేక యింజనీయరు మన ఆంధ్రుడు గావున మార్చికి గ్రాంటు కాస్త పెల్లెత్తుక పోతుందేమోనని విఘ్నేశ్వర పూజ ప్రారంభించి డిపార్టుమెంటల్ ద్వారానే చిన్న చిన్న పనులు చేయిస్తున్నాడు. ఈ ఆలస్య కారణాన్ని గమనింతురుగాక యని శ్రీ రేబాల పట్టాభిరామిరెడ్డిగారి నిర్యాణ పరామర్శకు 6తేది సాయంత్రం నెల్లూరుకు విచ్చేస్తున్న మంత్రి శ్రీ గోపాలురెడ్డి గారిని కోరుతున్నాం.

### మద్రాసు బస్సు

ప్రభుత్వపు, రవాణాశాఖ వారే మద్రాసు, చిత్తూరు, మద్రాసు - తిరుపతులకు నడిపినట్లే మద్రాసు నెల్లూరు సర్వీసును గూడ యీ 1తేది నుండి నడుపుతున్నారు. రైలు చార్జియింతో, అంతే బస్సు చార్జిగూడ. నెల్లూరు - గూడూరుకు యితర సర్వీసులవారు 0-12-0లు తీసుకుంటే ప్రభుత్వపు బస్ 0-8-0లు మాత్రమే తీసుకుంటున్నది. అట్లే మద్రాసు వారికూడా రు.2-14-0లు. మధ్య మధ్య ఆగకుండా పెద్ద స్టేషన్‌లలో మాత్రం ఆగుతూ యెక్స్‌ప్రెసు సర్వీసు అనిపిస్తుంది. అన్ని రూట్లుగూడా త్వరలో ప్రభుత్వమే నడుపుగాకయని మా గౌరవపూర్వక అభ్యర్థన.

### అధికారవర్గం

నెల్లూరు సబ్ మేజిస్ట్రేటు గుంటూరు సుబ్బరామయ్యగారు 2మాసములు శలవు. వీరికిబదులు సి.చలపతిరావు గారు 29తేది చార్జి తీసుకున్నారు.

అధికార్లకు మాత్రమే శలవుగాని, అధికారానికి శలవులేదన్నారు సుబ్బరాయుడు.

### తహశీల్దారు నారాయణరావుగారి దౌష్ట్యాలు

శంకరాగ్రహారం, పాముల రాధాకృష్ణయ్య రేషన్ కొట్టులో చీకటి విహారానికి దాగుకొని యుండిన 5బస్తాల బియ్యం, ఒక కట్టమైదా, 27 వీసెల చక్కెరలను పట్టుకున్నాడు.

3తేది కోవూరు టీ క్లబ్బుల సాహెబ్‌లు చక్కెర రుబెల వంతున కొంటుంటే పట్టుకున్నాడు.

నెల్లూరు రేషన్ కొట్టులో తప్పుడు తనం చేస్తుండిన 296 తక్కువ కొలత పాత్రలను పట్టుకున్నాడు.

వెంకటగిరి 11 మంది సాహెబులు 29 ఆవుల మీద యీదగాలి ఏటెం సుబ్బారెడ్డి పడకొని 2 1/2పుట్లధాన్యం 5తేది రవాణా చేస్తుంటే బి.యస్.ఓ.తో కలిసి పరుగెత్తి తరిమిపట్టుకున్నాడు.

ఈదగాలి, పూడిపర్తి, యీపూరు వగైరా గ్రామాల్లో నెల్లధాన్యమంతా వార్లు చీకట్లో అమ్ముకోనివ్వకుండా బలిజోరుగా జవురుతున్నాడు.

ఈ విధంగా అల్లాడిస్తే చీకటి మార్కెటు దారులు ఎట్లా బాగుపడతారురా యీశ్వరా!

* * *

కలెక్టరాఫీసు గుమస్తా పెగ్రటాజు రామచంద్రరావు గారు మంచి పాముమంత్ర గాడని ప్రతీతి. ఇలాంటివారిని టౌనులో వుంచకుండా వెంకటగిరికి మార్చినందుకు మా అసమ్మతిని తెలుపుతున్నాము. తిరుగా యిక్కడకు మార్చి పుణ్యం గట్టుకోండి.

### నాయుడుపేటలో హైస్కూలు విరాళాలకు విజ్ఞప్తి

నాయుడుపేటకు చుట్టుపట్ల 20 మైళ్ల లోపుగ ఎచ్చట హైస్కూలు లేని కారణమున అనేక వేలమంది విద్యార్థులు నష్టం పొందుతున్నారు. ఆ కారణంగా పెక్కు కుటుంబములు వృద్ధికి రావాలన్న... స్వతంత్ర దేశములో విద్య ... [illegible] ... నాయుడుపేటలో హైస్కూలు స్థాపనకు కనీసం 40వేల రూపాయలు కావలసి యున్నది. కావున సహాయం చేయగల విద్యాభిమానులందరు యీ సత్కార్యానికి తోడ్పడుదురని మిక్కిలి ప్రార్థించుచున్నాము.

- హైస్కూలు స్థాపక సంఘం

# చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

మాధవపెద్ది సురేష్ సంగీతం మెలోడి ప్రధానంగా సాగి చిత్రం విజయానికి దోహదపడింది. "ఓ గమ్యమున్న చరణం, అది సవ్యమైన చలనం " - సీతారామశాస్త్రి వ్రాసిన భావగర్భితమైన నేపథ్య సంగీతం వినతగింది."


**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ.100లు |
| విదేశాలకు చందా | రూ. 650లు |

## నీళ్ల లెక్కలు

4వ పేజీ కొరవ

నెల్ల పుంటుందన్న మాట. నవంబర్ 28తేదీ జరిగిన నీటిపారుదల శాఖ అధికారుల సమావేశంలో ప్రాజెక్టులో 8.5 టిఎంసిల నీళ్లు మాత్రమే వున్నందున లక్షా 14 వేల ఎకరాల్లో పంట వేయాలని అధికారులు చెప్పారు. ఈ ప్రకటన తర్వాత చాలా మంది రైతులు వ్యవసాయానికి సాహసించలేదు. నీటిని పొదుపుగా వాడాలని చెబుతూ ఆత్మకూరు, కావలి ప్రాంతాల్లో కొన్ని వేల ఎకరాల్లో నీటి విడుదల చేయక పోవడం వల్ల ఎండి పోయాయి. దీనికి అధికారులు సమాధానమేమి చెబుతారో? 20టిఎంసిల నీళ్లున్నా ఏ కాల్వ ద్వారా ఎంత నీటిని ఎప్పుడు విడుదల చేస్తారో అధికారులు ఇప్పటి వరకు ప్రకటించడం లేదు. కండలేరు ద్వారా అర టిఎంసి నీటిని వెంకటగిరి, గూడూరు ప్రాంత రైతుల ప్రయోజనాల కోసం విడుదల చేస్తామంటున్నారు. ఈ అర టిఎంసి పేరుతో మద్రాసుకు మంచినీటిని విడుదల చేసేందుకు అధికారులు పకడ్బందీగా ప్రణాళిక రచిస్తున్నట్లుంది. ఇది జిల్లా రైతులను వంచించడమే. పెన్నా డెల్టాలో మిగిలిన ప్రాంతంలో పంట వేయకపోవడం వల్ల 245కోట్లు రైతులు నష్టపోవాల్సి వచ్చింది. ఈ విషయంలో జిల్లాలోని రాజకీయ పార్టీలు, రైతు సంఘాలు, రైతులను చైతన్యపర్చాల్సి వుంది. ముందు ప్రకటించినట్లుగా జిల్లాలో పంట పండే వరకు మద్రాసుకు చుక్కనీరు విడుదల కాకుండా అడ్డుకోవాలి. పంట పండినాక వచ్చేది వేసవికాలం కాబట్టి నీటిని మంచినీటి ప్రయోజనాల కోసం అట్టిపెట్టాల్సి వుంది. వాస్తవాలు ప్రజల ముందుంచాల్సిన అధికారులు సోమశిల నీటి విషయంలో దాగుడు మూతల ధోరణికి మద్రాసుకు లేదా చిత్తూరు జిల్లాకు ఏ విధంగానైనా నీటిని పంపాలన్నదురుద్దేశమే ఈ దాపరికానికి కారణంగా వుంది.

## నెలవంకలు

10వ పేజీ కొరవ

మద్రాసులో మరణించారు. ఎసి. మరణవార్త విన్నవెంటనే నాటి అఖిల భారత్ కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్ నాడార్, తమిళనాడు ముఖ్యమంత్రి అన్నాదురై ఆస్పత్రికి వచ్చి శ్రద్ధాంజలి ఘటించారు. కేంద్రమంత్రులు కెవి. రఘునాథరెడ్డి కొత్త రఘురామయ్య పక్కనే ఉన్నారు. ఎ.సి. మరణవార్త రాష్ట్రాన్ని కకావికలం చేసింది రాజకీయ హేమాహేమీలను క్రుంగదీసింది. నెల్లూరు జిల్లా ప్రజలు నిశ్చేష్టులయ్యారు. నిస్తేజులయ్యారు. ప్రజాసేవలో అలుపెరుగని ఒక మహాయోధుడు తమ ఆప్తుడు అస్తమించాడని విలపించారు. జనప్రవాహం వెల్లువై నెల్లూరును ముంచెత్తింది. వాళ్ళ కన్నీళ్లతో పెన్నా గర్భం తడిసిపోయింది. నీలం సంజీవరెడ్డి, జలగం వెంగళరావు, బ్రహ్మానందరెడ్డి, కడప కోటిరెడ్డి లాంటి మహామహులెందరో నెల్లూరుకు తరలి వచ్చి తమ ప్రియతమ సహచర నేతకు కన్నీటితో వీడ్కోలు చెప్పారు. 40ఏళ్లపాటు నెల్లూరు ప్రజల ఆప్తుడై, ఆత్మీయుడై, ఆపద్బాంధవుడయిన ఎసి. దిగ్గంతాల యాత్ర దేదీప్యమాన్యమైంది. అజరామరమైన కీర్తి ప్రతిష్టలతో ఆ రాజకీయయోధుడు ఆనం వర్గ రాజకీయాలకు చిరుదివ్వె వెలిగించి దివికేగి పోయారు.

## చిన్నబజారు

4వ పేజీ కొరవ

మన్నారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి, ఎస్పీ నరసయ్య, ఎమ్పీ రాజేశ్వరమ్మ, ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, జెసి. చంద్రమౌళి, మునిసిపల్ కమీషనర్ కె.వేమారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## పల్లవిమార్చిన ఆర్యవైశ్యులు!

నెల్లూరు జిల్లా పేరును అమరజీవి పొట్టి శ్రీరాములు జిల్లాగా మార్చాలని ఏళ్ల తరబడిగా డిమాండ్ చేస్తూ ఒకేపాట పాడుతుండిన సంఘ నాయకులు తమ పల్లవిని మార్చారు. 2తేదీ రంగనాయకుల పేటలోని ఆర్యవైశ్య బులియన్ మర్చంట్స్ అండ్ పాన్‌బ్రోకర్స్ అసోసియేషన్ కళ్యాణ మండపంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ వైశ్య మహాసభ ప్రాంతీయ సమావేశంలో మహాసభ రాష్ట్ర అధ్యక్షుడు గంజి రాజమౌళి గుప్త మాట్లాడారు. రాష్ట్రంలోని ఆర్యవైశ్యులందరూ ఐక్యంగా ఉండాలి. రాజకీయంగా పైకెదగాలి. నెల్లూరుజిల్లాను కాకుండా మరో జిల్లా పేరును పొట్టిశ్రీరాములు జిల్లాగా మార్చమని ప్రభుత్వంపై వత్తిడి తెద్దాం. అవసరమైతే ఆందోళన చేద్దామన్నారాయన. సభలో రాజమౌళి గుప్తను ఆర్యవైశ్య సంఘం నాయకులు కె. వెంకట్రామయ్య, తిరివీధి ప్రకాశరావు, నున్నా వెంకట సురేంద్ర సన్మానించారు.

## పొదుపులక్ష్మి గ్రూపులకు 2కోట్ల 50లక్షలు

జిల్లాలోని 1500 పొదుపులక్ష్మి గ్రూపులకు వివిధ ఉపాధి పథకాలకు 2కోట్ల 50లక్షలు మేర వివిధ బ్యాంకుల ద్వారా ఆర్థిక సహాయం చేస్తున్నట్లు జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి చెప్పారు. 2తేదీ నెల్లూరు దర్గామిట్టలోని సిండికేటు బ్యాంకు శాఖలో వారంలో ఏడు రోజుల పాటు పనిచేసే విభాగాన్ని జిల్లా కలెక్టర్ ప్రారంభించి మాట్లాడారు. జిల్లాలో ఎంపిక చేసిన గ్రూపులకు బ్యాంకులు ఈ నెలాఖరులోగా ఆర్థిక సహాయం అందజేయాలన్నారు. ఆంధ్రాబ్యాంకు ప్రాంతీయ అధికారి రఘురామారావు మాట్లాడుతూ వారం రోజులపాటు పనిచేసే సిండికేట్ బ్యాంక్ దర్గామిట్ట శాఖలో ఎక్స్‌ప్రెస్ డిడి కౌంటర్, సీనియర్ సిటిజన్స్ స్పెషల్ కౌంటర్‌ను ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు. బ్యాంకు మేనేజర్ నాగేశ్వరరావు ఒరిస్సా తుఫాన్ బాధితులకు 10వేల రూపాయల చెక్కును జిల్లా కలెక్టర్‌కు ఈ సందర్భంగా అందజేశారు.

## నెల్లూరుటౌన్ డీలర్ల సంఘం

నెల్లూరుటౌన్ రేషన్ షాపుల డీలర్ల కార్యవర్గ సమావేశంలో 5తేదీ జరిగింది. అధ్యక్షునిగా వి. వెంకటసుబ్బయ్య, ఉపాధ్యక్షునిగా ఆర్. నాగేంద్రరావు, కార్యదర్శిగా ఎస్పి శేషయ్య, సహాకార్యదర్శిగా పి. విజయకుమార్, కోశాధికారిగా చిన్న నరసయ్యతోపాటు, కార్యవర్గ సభ్యులుగా మరో 9మందిని ఎన్నుకొన్నారు.

## సూక్తిసుధ గ్రంథావిష్కరణ

సూక్తిసుధ గ్రంథావిష్కరణ సభ జనవరి 1తేది తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానంలో జరిగింది. గ్రంథాన్ని సురభి రామయ్య ఆవిష్కరించారు. స్వయంపాకుల శ్రీనివాసులు, డి.వి. మాధవరావు ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో మాట్లాడారు. ఆర్యధర్మ మహాసభ కార్యదర్శి అమృతవాక్కుల శేషకుమార్, చింతా శ్రీరామమూర్తి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## బిజెపి టౌన్ కమిటీ

బిజెపి టౌన్ కమిటీలో ఖాళీలను భర్తీ చేసినట్లు పార్టీ పట్టణాధ్యక్షుడు కప్పిర శ్రీనివాసులు చెప్పారు. పట్టణ పార్టీ కార్యదర్శిగా సి.మహాకర్‌రెడ్డి, కోశాధికారిగా కపూర్ టి. రాజ్‌పురోహిత్, నగర కార్యవర్గ సభ్యులుగా సాదా రామయ్య, నెల్లూరు సుధాకర్, వి.గోపికృష్ణ, టి.సురేష్ నాయుడులను నియమించారు. పట్టణ యువమోర్చా ఉపాధ్యక్షుడుగా ఎస్. దయాకర్‌రెడ్డి, పి. తిరుపాల్, కార్యదర్శిగా జి. వినయ్‌కుమార్, మహిళా మోర్చా పట్టణ కార్యదర్శిగా ఎస్.మేరి, సాంస్కృతిక బృందం కన్వీనర్‌గా కె. లీలమ్మను నియమించినట్లు శ్రీనివాసులు చెప్పారు.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press, Ph: 091-861-327354. Offset Printing at Zamin Ryot Press, Nellore